# మళయాళీ

గోపీ మనస్సు మనస్సులో లేదు. పద్మనాభస్వామి దేవాలయంలోకి వెళ్ళిచూస్తే అక్కడి కొలనులో స్త్రీలొక రేవులోను, పురుషులొక రేవులోను కాకులవలె గుంపులు పడి అంగవస్త్రాలతో స్నానాలు చేస్తున్నారు. కాలేజీకి వెళ్ళి చూస్తే అక్కడ స్త్రీలు ఆడే ఆడే బేడ్‌మింటన్ ఆపివేసి ఆతన్ని చూచి పక్కున నవ్వారు. ఊరి బయటకు వెళ్ళి చూస్తే పొలల్లో యువతులు గూడకట్టు మాత్రంగా పని చేసుకుంటున్నారు. అక్కడికి దగ్గరలో ఒక ప్రదర్శనోత్సవం జరుగుతోందని తెలుసుకొని అక్కడికి వెళ్ళాడు.

అక్కడ ఒక షాపులో జూనియర్ మహారాణి చిత్రపటం, ఫస్ట్‌ప్రిన్సెస్ చిత్రపటం చూచి 'సీనియర్ మహారాణి చిత్రపటం ఉందా' అని అడిగాడు.

'లేదు.'

గోపీకి సీనియర్ మహారాణి అంటె అభిమానం. ఆ దేశంలో మొన్న మొన్నటిదాకా స్త్రీలు రవికెలు లేకుండా తిరిగే వారనీ, రవికెలు లేకుండా గడపదాటితే వారిని దండిస్తామని సదరు దొరసానిగారు ఫర్మానా దయచేయించారనీ ఒక గాధ ఉంది. ఇప్పటికీ పద్మనాభస్వాములవారి దేవాలయం ప్రవేశించేటప్పుడు పురుషులకు చొక్కా ఉండగూడదు. పూర్వం స్త్రీలకు రవికెలు కూడా ఉండగూడదట. ఈ ఆచారాన్ని కూడా సీనియర్ మహారాణీగారే మాన్పిం

చారట. [ఈ ఆచారాన్ని మాన్పించినందుకు కోపం తెచ్చుకునే యువకులు లేకపోలేదు.] అటువంటి సీనియర్ మహారాణీ చిత్రపటం అక్కడ లేదు.

గోపీ ఫస్టుప్రిన్సెస్ చిత్రపటం బేరంచేస్తూ నిలబడ్డాడు. ఆ రాజ్యానికి ఇప్పుడు పరిపాలిస్తున్న మహారాజు తర్వాత ఈమె కుమారుడే రాజపుత్రాడు. తిరువాన్కూరులో రాజు కుమారుడు రాజు కాడు.

"మద్రాసు విద్యార్థులను చూచినప్పుడు మళయాళీలు ప్రతిది ధర ఎక్కువ చెబుతారు. మా వాసన తగలగానే చక్రానికి పోసే కాఫీ రెండు చక్రాలవుతుంది. ఎందుకని?" అని ఆ షాపు అమ్మాయిని అడిగాడు గోపీ.

ఆమె నవ్వి "మీరు లేకపోతే ఈ ప్రదర్శనాలే ఉండవు," అంది.

గోపీకి సంస్థానాలనుగురించి ఆమె ఏదో రహస్యం చెప్పి నట్లుగా ఫీలయి, ఆలోచించ బుద్ధి అయింది. స్వదేశసంస్థానాలన్నీ ఇంతే. సంస్థానేతరులను ఆకర్షించి వారి మెప్పును పొందటానికి సంస్థానాధీశ్వరులు గారడీలను చేస్తారు. పట్టణాలను శోభాయమానంగా చేసి, సత్రములను, రాధారి బంగళాలను పరిశుభ్రంగా ఉంచుతారు. ఒకటి రెండు రోజులుండి పోయేవాడు గుమ్మయిపోతాడు. పల్లెటూళ్ళకు పోయి చూస్తేగాని వీటి పస బయటపడదు. అతని ఆలోచన హఠాత్తుగా ఆగిపోయింది. ఎవ్వరో చెయ్యిపట్టుకొని లాగినట్లు అనుమానపడి వెనక్కు తిరిగి చూశాడు.

"నేనేమి చెయ్యాలో చెబుతారా?" అని ఆ అమ్మాయి

ప్రశ్నించింది. ఆమెకు 18 సంవత్సరాలుంటాయి. గూడ కట్టు కట్టి, బిగుతు రవికె తొడిగి తుండుగుడ్డ ఒంటిబుజాన వేసింది.

గోపీకి గాభరా వేసింది. ఆరోజు తను వచ్చి ఊర్లో అడుగు పెట్టగానే ఒక స్నేహితుడు, 'ఇక్కడ స్త్రీలు ధగధగాయమానంగా ఉంటారు... ఇక్కడి నీళ్ళు కాచుకొని తాగాలి. అనాసకాయ తినేవ్ — ఇక్కడి స్త్రీలు కొంపలు తీస్తారు. గది అద్దెకు ఇస్తామని పిలిచి, ఇంట్లో అడుగు పెట్టగానే, "నన్ను మల్ని బలాత్కారిస్తున్నాడు, వీని జుట్టు తెయ్యండి, వీనిశిరస్సు కొట్టండి,' అని గోల చేసి, జనాన్ని పోగుచేసి, వందో రెండువందలో ఇవ్వకపోతే కోర్టులోకి లాగుతామని బెదిరిస్తారు. నీవు జాగ్రత్తగా ఉండాలిసుమా!" అని చెప్పాడు. గోపీకి ఇవన్నీ జ్ఞాపకం వచ్చి బిత్తరచూపులు చూశాడు.

"ఇప్పుడు నేనేమి చెయ్యాలి?" అని అడిగిందా పిల్ల. ఆతడు ఆమెని నిదానించి చూశాడు. ఆమె ఎర్రని సన్న పెదిమలు అతన్ని ఆకర్షించాయి.

"నీవేమి చెయ్యకూడదో చెబుతాను. బజార్లో, పదిమందిదిలో, నాబోటి పెద్దమనుష్యులతో, సంభాషణలోనికి దిగకూడదు," అన్నాడు.

"అయితే నేను చస్తాను," అని వెళ్ళిపోబోయింది. ఆమె విశాల నేత్రాలు ఒక్కసారి అతన్ని దీనంగా చూశాయి. ఆమె క్రిందిపెదవి గాలికి కొట్టుకునే లేతతమలపాకువలె వణికింది. ఆమె దుఃఖించబోతోందని, కన్నీటిధారలతో

తన శరీరాన్ని తడుపుకోబోయిందని అతడు గ్రహించాడు.

"ఏడుపకు, నేనేమి చెయ్యాలో చెప్పు," అన్నాడు. ఈ మాటలు విని ఆమె రెండడుగులు ముందుకు వేసింది. ఒక్క నిట్టూర్పు విడిచింది ఆమెకు నమ్మకం లేదని గోపీ అప్పుడు తెలుసుకున్నాడు.

"క్రిష్ణనాయర్ ఎక్కడున్నాడో చెప్పు. లేదా చెప్పి పోయాడు."

"ఏ క్రిష్ణనాయర్?"

"అతణ్ణి నేను వివాహం చేసుకోబోతున్నాను."

"అతని ఇంటి పేరు?"

"నాకు తెలియదు."

"అతడు ఎక్కడుంటాడు?"

"నేను మిమ్మల్ని అడిగేదే అది."

"ఈ ఊర్లో ఎవర్నయినా ఎరుగుదువా?"

"ఎరగను," అని తలూపి, "నాకు ఆకలేస్తోంది," అన్నది ప్రక్కనున్న కాఫీహోటలు చూపి, "అక్కడ పదార్థాలు పరిశుభ్రమైన కొబ్బరినూనెతో తయారు చేస్తారు. ఒకచక్రంతో కడుపు నిండుతుంది," అన్నాడు.

"నా దగ్గర ఒక చిల్లికానియైనా లేదు. ఈ బట్టలు తప్ప నా దగ్గర ఏమీ లేవు, ఇవి కూడా మాసిపోయి అసహ్యంగా ఉన్నాయి కాదూ?"

"ఏమంత బాగుండలేదు"

"నేనేమి చెయ్యాలో చెప్పండి. మీరేది చెబితే అది చేస్తాను, మీరేమీ చెప్పకపోతే చస్తాను."

గోపికి భయం వేసింది. ఆమె తిరిగి చూస్తే నిజంగా చస్తుందేమో అనుకుంది. "నీకు రెండుమూడు రోజుల తిండికి సరిపోయేటట్లుగా డబ్బిస్తాను. క్రిష్ణనాయర్‌ని కనుక్కోవటం మాత్రం సాధ్యం కాదు."

"అతడు కనబడకపోయినా పరవాలేదు. అతడు నా త్రాడు తెంచాడు, రైలు ఎక్కించి ఎక్కడికో పోయాడు. రైల్లో మొగవాళ్ళు వేసే ప్రశ్నలకు జవాబు చెప్పలేక చచ్చిపోయాను. మా తండ్రిబాధ పడలేక వచ్చాను గాని..."

"నీవు ఎక్కడనుంచి వస్తున్నావు?"

ఏదో చిన్నపల్లెపేరు చెప్పింది

"అక్కడ ఏమి చేస్తుండే దానివి?"

"గదిలో కూర్చుని కిటికీలోనుంచి బయటకు చూస్తుండే దాన్ని"

"ఏ కిటికీ?"

"మా ఇంటి కిటికీ.....మా తండ్రి ఇంటి కిటికీ...... అతడు నా తండ్రికాదు. నా తల్లిని వివాహం చేసుకున్నాడు. నా తండ్రి చచ్చిపోయేటప్పటికి నేను నా తల్లి గర్భంలో ఉన్నాను. తరువాత అతడు నా తల్లిని వివాహం చేసుకున్నాడు...... నా తల్లి ఎప్పుడూ ఏడుస్తుంటుంది. ఆమెకు స్ఫోటకం పోసింది. అతడు నా తల్లిని ఎప్పుడూ కొడుతూ ఉంటాడు." గోపీకి ఇదంతా గొడవగా ఉంది. "క్రిష్ణనాయర్ నీకు ఏమవుతాడు?" అని అడిగాడు.

"అతడు నేను కూర్చున్న కిటికీ క్రింది నుంచి వెళ్తుండే

"గోపీ."

"మేరీ, గోపీ......గోపీ మేరీ," అని చప్పట్లు కొడుతూ గంతులు వేస్తోంది.

"ష్... మేరీ. వద్దు. అందరూ మనవంకను చూస్తున్నారు. నాకు తలవంపులుగా ఉంది."

పాపం, ఆ అమ్మాయి సంతోషం ఏమయిందో! జొటజొట కన్నీళ్ళు కార్చటం మొదలు పెట్టింది.

ప్రొఫెసర్ నన్న పెద్ద మనిషి ఒకడు పత్రిక చదవటం మానివేసి గోపీని ప్రశ్నగా చూశాడు. "అబ్బాయి ఏడిపిస్తున్నాడు పసిప్ప," అని మరో నాగరిక శిరోమణి పళ్ళు కొరికాడు. "ఓదార్చడేం?" అని ఆశ్చర్య పడ్డాడు ఒక అరవ విద్యార్థి.

గోపీకి కంపరం పుట్టింది. ముందు ప్రదర్శనశాల నుంచి బయట పడితే చాలనుకున్నాడు. కారు పిలిచి మేరీని ఎక్కించి 'పోనివ్వు' అన్నాడు. ప్రదర్శనశాల దాటగానే మేరీ ఆకలిగా ఉన్న సంగతి జ్ఞాపకం చేసింది. అతడు ప్రక్కనున్న కాఫీ హోటల్లో కాఫీ ఇప్పించాడు. ఆమె ఆశగా నాలుగు కప్పుల కాఫీ తాగింది. కాఫీ సర్వ్ చేసే ఆబిడ గోపీని చూచి హేళనగా నవ్వింది. గోపీ కంపించిపోయాడు. త్వరగా బిల్లు ఇచ్చి, మేరీని కార్లో వేసుకొని ఉత్తరాభిముఖుడై బయలుదేరాడు.

'ఎక్కడికి?'

"నేను ఆపమనేదాకా నీ ఇష్టం వచ్చినట్లు పోనివ్వు," అని డ్రైవరుకి చెప్పాడు. "మనం ఎక్కడికి పోతు

నాన్నము?" అని అడిగింది మేరీ.

"ఎక్కడికో! నిన్ను సరిగ్గానో సవరించుకోవాలి. ఈ ప్రపంచంలో పిల్లులు, కుక్కలు కావలసినన్ని ఉన్నాయి. ఈ ప్రక్కనే పెద్దపులులు, సింహాలు పెంచే శాల ఉంది. పోయిన వస్తువుల్ని దాచే ఆఫీసులున్నాయి. నీవు పిల్లివి కాదు. పెద్దపులివి కాదు. ఆఖరికి గొడుగువైనా కాదు. నిన్ను నేనేమి చేసేది," అని [illegible].

ఆమె మాట్లాడలేదు. అసలు ఆమెకు అర్థమయిందో లేదో... గొంతు రెండుగా చీలిపోయింది. ప్రొఫెసరు 'ఏ ప్రక్క పోనివ్వమంటారు?' అని అడిగాడు. గోపీ ఆలోచించకుండానే "తూర్పుకి" అన్నాడు. తూర్పున ఏముంది? ఏ తూర్పు దేశంలో మేరీని వదులుతాడు?

మేరీ కార్నర్ హాయిగా కూర్చొని సంతోషంగా బయటికి చూస్తోంది. హెంకోక్ బిల్డింగును చూసి 'ఏమిటది?' అని అడిగింది. లాంకాస్టర్‌ని చూసి "ఏమిటిది?" అని అడిగింది. సిగియస్ చర్చిని చూసి "ఓ, ఏమిటిది?" అని అడిగింది. మ్యూజియమును చూసి "ఏమిటిది?" అని అడిగింది.

"తిరువానూరు అనే మానవుని శరీరానికి ఇవన్నీ తలకాయలు." ఆమెకు అర్థం కాలేదు. తన కోమల కంఠంతో అతని చెయ్యిపట్టుకొని, "మీకు నామీద కోపం వచ్చింది. నేనేమి చేశాను?" అని అడిగింది.

గోపీ చేతిని విదిలించుకొని, "ఈపని ఎప్పుడూ చెయ్యకు. నిన్నేమి చెయ్యాలో తోచక చస్తున్నాను. నిన్నిక్కడ వదలి పెడతాను."

"అయితే నేను చస్తాను"

గోపీ హృదయం కలుక్కుమన్నది. ఆమెని అకారణంగా కష్టపెట్టినందుకు ఎంతో నొచ్చుకున్నాడు. కారు రాజ్పాసాగా దాటి వెళ్తోంది. చల్లని గాలి ఝుంయిమని కారులోకి విసిరింది. మబ్బులు అటుతీరానికి, ఇటుతీరానికి, వర్షపు చినుకులను రాలుస్తున్నాయి. ఆమెను ఓదార్చటానికని గోపీ నవ్వి, "నీవు మంచిపిల్లవైతే నేను చెప్పినట్లు చెయ్యి," అన్నాడు.

"మీరు నా యజమానులు. నేను మీ దాసిని."

"నీవు మంచి దానివి."

ఆమె సంతోషంతో, సాతృప్తితో, కన్నులు మూసుకుంది. గోపీ దీర్ఘాలోచనలో పడిపోయాడు. హఠాత్తుగా ఆమె, "అదుగో క్రిష్ణనాయర్," అని కేక వేసింది. గోపీ సమయానికి ఆపకపోతే కారులోనుంచి దూకేది కూడాను. ఆ ప్రక్కనే వున్న సెలూనుకి కట్టిన 'క్రిష్ణనాయర్' అనే బోర్డు చూచి, ఇంత ఆర్భాటం చేసింది. ఈ మహాపట్టణంలో అనేక మంది క్రిష్ణనాయర్లుంటారని, ఈ క్రిష్ణనాయర్ తన ప్రియుడు కాడని, ఆమెకు నచ్చ జెప్పేసరికి గోపీకి ప్రాణం మీదికి వచ్చింది.

కారు సాగి పోతోంది. 'మేరీని ఏమి చెయ్యాలి' 'మేరీని ఏమి చెయ్యాలి' అనే ప్రశ్న అతని తలను బ్రద్దల గొడుతోంది.

"మీ ఇల్లెక్కడ?" అని అడిగింది మేరీ. గోపీకి అప్పుడు తట్టింది. "నిజమే, ఇంటికి తీసుకొనిపోతే!" మంచో

చెడో గాని అంతకంటే గత్యంతరం లేదనుకొని డ్రైవరుకి తన ఇంటి అడ్రస్ ఇచ్చి పోనివ్వ మన్నాడు.

"ఇదిగో మేరీ; నిన్ను మా ఇంటికి తీసుకొని పోతు న్నాను. క్రిష్ణస్వామయర్ సంగతి రేపు పోలీసులకు రిపోర్టు చేద్దాము.

"మీ ఇల్లు ఇక్కడికి ఎంత దూరం?"

"దగ్గరే!"

"ఈ ఊరు చాలా పెద్ద దనుకుంటాను. ఎన్ని రోజులు తిరిగినా తరగదని మా ఊర్లో చెప్పుకుంటారు? చంద్రుని కంటే ఏ కొన్నో పెద్దది. ఇంతేనా?"

ఆమెను ఏవిధంగా అర్థం చేసుకోవాలో గోపీకి అంతు పట్టలేదు. "ఈ ఊరు బాగుందా?"

"చక్కగా ఉంది. కాని ఈ మోతతో తల దిమ్మెక్కు తోంది."

కారు గోపీ ఇంటి ముందు ఆగింది. అతడు ఆమెను కారులో నుంచి దింపాడు.

"ఇదేనా మీ ఇల్లు?"

"ఊ"

మీ తల్లి ఇంట్లో ఉందా?"

"లేదు."

"మీ భార్య, నా యజమానురాలు ఉందా?"

"నా కింకా వివాహం కాలేదు."

ఆమె పక్కున నవ్వి 'ఇన్నాళ్లు వివాహం చేసుకోకుండా ఏమి చేస్తున్నారు?' అని ప్రశ్నించింది.

ఆరోజున ఎడ్యుకేషనల్ స్టాండింగు కమిటీ మీటింగు. ఇదివరకు తాలూకాబోర్డు ఆఫీసులో జరుగుతున్నది. గేట్ దగ్గర నుంచున్నాడు వెంకట్రావు. ఎంతసేపటికి మీటింగు పూర్తి గాదు. లోన మెంబర్లు పోట్లాడు కుంటున్నారు. అతనికి కడుపులో మండిపోతున్నది. అరకప్పు కాఫీ ఐనా జఠరాగ్ని కుండంలో పడ లేదు. ఒళ్ళంతా స్వేదస్నానం చేసినట్లయింది. కోటుగుండీలు విప్పి పూత్కారం చేయటం మొదలుపెట్టాడు ఆలస్యమైనకొందికీ చిరాకు ఎక్కువైంది. మీటింగు పోట్లాటతో ముగిసింది. చిట్టిబుట్టి మంటూ ప్రెసిడెంటు బయటికి వస్తున్నాడు. వెంకట్రావు నమస్కారం చేసి, " నా పుస్తకాన్ని తీసికోటానికి కమిటీ ఆమోదించి రెండునెల్లయింది. ఇంతవరకు ఆర్డరు పంపించలేదు," అన్నాడు.

" ఏమిటీ? "

" శివరాత్రి. మూడాశ్వాసాల కావ్యం. మే 28 మీటింగులో పాసైంది. "

" జ్ఞాపకం లేదే...... సరే చూస్తాను. మళ్ళొకసారి కనిపించు," అని వెళ్ళిపోయాడు.

హతాశుడైపోయాడు వెంకట్రావు. మెల్లగా కాళ్ళీడ్చుకొంటూ పన్నెండు గంటల ఎండలోబడి బయలుదేరాడు. ప్రెసిడెంటు వాక్యంతో అతని మనస్సు శూన్యమైపోయింది. కన్నుల్లో ఆకలి తాండవించింది. పోతుంటే బక్, బక్, మని ఒకకారు తరువాత ఒకటి వెళ్ళుతున్నది. అతని దృష్టిలో ఈర్ష్యా సౌదామని మెరసింది. "వీళ్ళంతా కారు

వేసుకొని వెళ్ళుతున్నాడే!" అని పెద్దగా అనుకొన్నాడు.

"నీ కర్మ, ఏం చేస్తా" మన్నాడు కారులో పోతున్న కొంటెవెధవ. దానితో వెంకట్రావుకి కడుపు మండింది.

ఈ వెధవలంతా వెలగబెట్టిందేమిటి, నేను వెలగబెట్టం దేమిటి? ప్రపంచంలోని సౌఖ్యాలన్నీ వీళ్ళ వంతా? కష్టాలన్నీ నాలాంటివాళ్ల వంతా? ఆమేడ ఎంత అందంగా వుంది? అదిగో ఆ అమ్మాయి భిక్షం వేస్తూ కూలబడ్డది. ప్రపంచంలో ఎంత సౌందర్యముంది! ఎంత ధనముంది! ఎంత సుఖముంది! నా కర్మం కాలితే పవిత్రంగానైన తృప్తిపడటానికి వీల్లేదుకదా! రోజురోజూ తిండికి అవస్థ పడాలిసిందే, సౌందర్యం చూచినపుడల్లా గుటకలు మింగు తుండవలసిందే. మంచి పుస్తకం చదివినపుడల్లా కన్ను గుట్టి చించబోయి హృదయం ఒప్పుకోక మానేస్తాను. అందుకనే నా పుస్తకాలు మూలలు చిరిగి వుంటాయి. అబ్బా, యీ బాధ భరించలేను మిఠాయి ముందుపెట్టి కుర్రాణ్ణి తిననకుండా చేస్తే వాడి హృదయం ఎట్లాకొట్టుకుం టుందో అలావుంది నా స్థితి. ఈ తుచ్ఛపు బ్రతుకు బ్రతికేకంటె యీ అనంత సౌందర్యాన్ని ఆనందిస్తాను. ఈ ప్రపంచము చౌర్య మంటుంది. సంఘం ద్రోహ మంటుంది. అంటే అననీ, అదంతా బూర్జువా మొరాలటీ. యాచించి నీచపు బ్రతుకు బ్రతకటంకంటే చౌర్యముచేసి చక్కటి జీవనం చేయటం మంచిది. మొదటిదానిలో అపాయంలేదు; రెండోదానిలో వుంది. ఐతే ఏం? "నేనూ మానవుణ్ణే; ప్రపంచసౌందర్యాన్ని ఆనందించటానికి నాకూ

తుంటే నిధి కోసం వెళ్ళాలిసి వచ్చింది. మెల్లగా వెళ్ళి వస్తున్నా."

"శివరాత్రికోసమేనా?" అన్నాడు డాక్టరు.

"ఆఁ. కమిటీలో పాస్సై రెండు నెలలైంది. ఇంతవరకు అతీగతీ లేదు. కరువుగోజుల్లో వీళ్ళచుట్టూ తిరగటానికి ముప్పై రూపాయలు ఖర్చుపెట్టాను."

వెంకట్రావు ముఖంలోకి చూస్తున్న తీర్థులు, "నేను చెప్పలేదా? తెలుగు కవులకున్న తెగులే యిది. సంఘస్థితి గమనించకుండా వ్రాస్తే ఏమౌతుంది? చేలో మొగక తియ్యమన్నచోట తియ్యక పళ్లాన్ని గొయ్యి చేస్తే కూలివాడికి డబ్బులు ఎవరిస్తారు?" అన్నాడు.

"కవులు స్వేచ్ఛావిహంగాలు;

'లోన ఈ కుసుమాలంపు లోకమెల్ల
చందములనైన వడనిమ్ము స్వచ్ఛనీల
మేఘమాలికాంచలములో మినుకు మినుకు
మనుచు రాజమరాళమ్మునై చరింతు"

అన్నాడు కవి. అలాంటి ధన్యజీవుల్ని పట్టుకొని కూలీలతో పోలిస్తే ఎట్లా?" అన్నాడు ప్రకాశరావు.

"నిజమే, ధన్యజీవుల్లో ధన్యజీవులు! వెంకట్రావుగారి ముఖంలోకి చూడు: అధోలోకంలోకి పడిపోతున్న మానవ కోటిని చూచి ఎలా జాలిపడుతున్నారో."

"ఒరే తీర్థులు, ఈవడ్డింపులు చాలు; పోనీ, ఇంతవరకు తిండి తినలేదు."

"వెంకట్రావ్, రేపు డిస్ట్రిక్టుబోర్డులో డబ్బు వచ్చిం తరువాత ఏంచేస్తావు?" అన్నాడు డాక్టరు.

"ఓ ఫరవాలేదు. మిగులుతుందన్న భయం అక్కర లేదు. ఈలోగా అప్పు చేస్తాడు," అన్నాడు తీర్థులు.

"నెల రోజుల్లోనే నాలుగు వందలు అప్పు చేస్తాడా? మహా ఐతే ఒక ముప్ఫై నలభై రూపాయలు ఖర్చయ్యేను," అన్నాడు ప్రకాశరావు.

"కాఫీ అన్నా దొరుకుతుందేమో నని ఆశపడుతున్నట్లుంది. అదేం వల్లకాదు. కవిత్వంమీద వచ్చింది కవిత్వానికే వినియోగించాలి. ఆంధ్రలోకము కవిత్వాన్ని ఆనందించే స్థితిలో లేకుండా వుంది. అందులో ముఖ్యంగా మన వెంకట్రావుగారి కవిత్వాన్ని, సత్యనారాయణగారి కవిత్వాన్ని, భావకవిత్వాన్ని, ఈ వచ్చే వర్షాకాలంలో బడిపెట్టి ఆ కవిత్వాల గొప్పతనం బోధించాలి. ఎవ్వడన్నా వెంకట్రావు కవిత్వాన్ని చదివివుంటే రెండునెల్లపాటు స్కూల్లో ఆచార్యకత్వమన్నా యిచ్చేవాడు. నీ జన్మలో ఆ పుస్తకాల్ని చూచిన పాపాన పోలేదాయె. నీకర్మ," అన్నాడు తీర్థులు.

అంతా ఒకసారి మెల్లగా నవ్వారు. వెంకట్రావు నవ్వుతూ తీర్థులు బుజం చరచి చర్రున బయట పడ్డాడు.

కొంచము సేపటికి మోడరన్ కేఫీ దగ్గరకు వచ్చాడు. ముక్కాని దమ్మిడీ వుంది. కాఫీ హోటల్లోకి వెళ్ళి, "అయ్యర్!" అన్నాడు. ఒక ఎర్రటి కుర్రాడు తాంబూలం తీరిగ్గా నమల్తూ వచ్చి, "ఏం కావాలండి? మైసూర్ పాక్ జహాంగీర్ బాసుంది బాదంహల్వా పాల్పేణి, స్వీట్—బూంది పూస పూరి, రవ్వట్టు హాట్. గారె ఇంకా కాలేదు. ఏం తెమ్మంటారు?

"రవ్వట్లు చెప్పు"

పెద్దగా "రవ్వట్లూ." "ఇంకేం తెమ్మంటారు?"

"ఇంకేమీ అవసరం లేదు," అని శ్రీను సనాగానికో పడ్డాడు. కొంచము సేపటికి అట్లు వచ్చింది. తను చేతులు కడుక్కుంటున్నాడు

"కాఫీ?" అన్నాడు సర్వరు.

"ఆఁహాఁ."

"టీ, కోకో, ఓవల్ టీన్, ఏం కావాలి?"

"బిల్."

అయ్యరు వెంకట్రావు ముఖంలోకి చూస్తూ బిల్లు వ్రాశాడు. "చస్తానన్నా చావనీయరేమో నక్షవలు? అంత అనుమానంగా చూస్తూ ఏడిపిస్తారెందుకు?" అనుకొన్నాడు వెంకట్రావు.

బయటికి వచ్చి బిల్లు చెల్లించి కిళ్లీ కొట్లో అరపాకెట్ క్రావెన్ ఏ తీసుకొని డబ్బులు తరువాత యిస్తానని ఇంటి దగ్గరకు వచ్చాడు.

లోన మాటలు వినిపిస్తున్నాయి.

"అమ్మాయీ, బళ్లోకి పోతేదేమ్ ?"

"నా కాసికాయలెయ్యి? ఎన్ని రోజులైంది తినుకొని! ఎప్పుడో ఇస్తానన్నావు. ఇంతవరకియ్యలేదు. అవి పెట్టుకొని గాని మరి బళ్లోకి వెళ్ళను. తెలుసా ?"

"నీవు సంపాయించావా ? ఊరికే గుంజుకుంటావు."

"నీవు సంపాయించావేంటి ? అమ్మనమ్మ నీకిచ్చింది. నీవు పెట్టుకున్నావు. నీవు నాకిచ్చావు, నేను పెట్టుకున్నా. నావి

గాని ఎవ్వరి వాతాయి. తే, లేకపోతే బళ్లోకి వెళ్ళను."
"వాటిసంగతి నాకు తెలియదు మీ నాన్న నడుగు."
"దొంగ, అబద్ధం. మానాన్న వాటిని ఏం చేసుకొంటాడు? మెళ్లో వేసుకుని బజారుకు వెళ్లుతాడా? పట్టిది. పట్టిది. తీసుకురా."
"వకుళం నిజమ్. నాన్న వచ్చాక సాయంత్రం అడుగు ఇప్పుడు బళ్లోకి వెళ్లు. మా అమ్మగా పో."
"దొంగ. పచ్చిదొంగవి. నాన్న నడగలేదనుకున్నావా? ఏమీ ఎరగడు. అదిగో గంట వినబడుతున్నది. సాయంత్రంగాని తేలదులే," అంటూ పుస్తకాలు పట్టుకొని తుర్పున వీధిలోకి పరుగెత్తుకెళ్ళింది.
వెంకటావు సిగరెట్టుపొగ వదుల్తూ వాకిట్లోకి వచ్చి రావటంతోనే కోటూ, చొక్కా విడిచి విసిరి మంచం మీదికి పారేశాడు. బీరువా దగ్గరకు వెళ్ళి తలుపు తీశాడు. ఆశ్చర్యం వేసింది. టేబుల్ దగ్గరకు వెళ్ళి డ్రాయర్లు రెండూ లాగాడు. ఆ గట్టిగా లాగటంతో ఒక సొరుగు దభేలున క్రింద పడ్డది. "శారదా! శారదా!" అని గట్టిగా కేక వేశాడు.

వంట యింట్లోనుంచి శారద మెరుపు మెరిసినట్లు ప్రత్యక్షమైంది. ఆమె గుండె కొట్టుకొంటూవుంది. ఆమె కళ్ళుమాత్రం పిశాచపునవ్వు నవ్వుతున్నాయి.
"ఏమయ్యాయి?" అన్నాడు ఆవేగంతో వెంకట్రావు.
"ఏమిటీ?"
వెంకటావు మనస్సు ఉడికిపోతున్నది. ఒక్కసారి

శారద ముందుకు దూకి బుజాలు రెండూ గట్టిగా పట్టుకొని ఊపుతూ, "నా పుస్తకాలు. నా వ్రాసుకొన్న వ్యాసాలు..

"ఏం పుస్తకాలు"

"ఏం పుస్తకాలా?......నా శాఫో, నా హోమర్, నా యూనటోల్ ఫ్రాన్స్, నా రోమేరోలా—"

"నాకేమ్ తెలియదు."

"ఏమీ తెలియదూ? నా కథలు, నా నాటకాలు, నా పద్యాలు, ఏమీ తెలియదు? ఏంచేశావ్?" అని గట్టిగా వూపి వెనక్కి నెట్టాడు. గదంతా పచారుచేసి మళ్ళీ శారదవంక చూచి "ఏమయ్యాయి?"

శారదకు కోపం వచ్చింది. "ఏమయ్యాయా? అన్నీ కాగితాల పొట్లాల కమ్మివేశాను."

వెంకట్రావు స్తబ్ధుడై పోయాడు. ఎర్ర కన్నులతో రెండు నిమిషాలట్లే చూచాడు. కోపం జారిపోయింది. ఒడలు కుంచితమైపోయింది. కన్నులు జాలిగా "నిజమేనా?" అని ప్రశ్నించాయి.

ఆస లుడిగి మీదకు తిరగబడ్డ లేడిలాగా శారద తిరగబడింది. "ఇందుల్లో ఒక్క మాటకూడ పొల్లులేదు. నిన్ను ఏడ్పించాలనే అన్నీ అమ్మివేశాను. నా కసి తీర్చుకొన్నా."

"నీకేమి అపకారం చేశాను?"

"నేను పెళ్ళిచేసుకొన్నది ఈ వెంకట్రావుని కాదు. వీడు వట్టి మూఢుడు. వట్టి స్వార్థపరుడు; నీచుడు. ఆనాటి వెంకట్రావు అలా కనపడలా. అతనికి ఇంత ఆకలి— ఇంత కుటుంబ ధ్వంసం చేసే ఆకలి, ప్రపంచాన్నే ఒక్క

గాక ఎవ్వరి వాతాయి. తే, లేకపోతే బళ్లోకి వెళ్ళను."

"వాటిసంగతి నాకు తెలియదు మీ నాన్న నడుగు."

"దొంగ, అబద్ధం. మానాన్న వాటిని ఏం చేసుకొంటాడు? మెళ్లో వేసుకుని బజారుకు వెళ్లుతాడా? పట్టిది. వట్టిది. తీసుకురా."

"వకుళం నిజమ్. నాన్న వచ్చాక సాయంత్రం అడుగు ఇప్పుడు బళ్లోకి వెళ్లు. మా అమ్మగా పో."

"దొంగ. పచ్చిదొంగవి. నాన్న నడగ లేదనుకున్నావా? ఏమీ ఎరగడు. అదిగో గంట వినబడుతున్నది. సాయంత్రంగాని తేలదులే," అంటూ పుస్తకాలు పట్టుకొని తురుస్తున వీధిలోకి పరుగెత్తుకెళ్ళింది.

వెంకటార్రావు సిగరెట్టుపొగ వదుల్తూ వాకిట్లోకి వచ్చి రావటంతోనే కోటూ, చొక్కా విడిచి విసిరి మంచం మీదికి పారేశాడు. బీరువా దగ్గరకు వెళ్ళి తలుపు తీశాడు. ఆశ్చర్యం వేసింది. టేబుల్ దగ్గరకు వెళ్ళి డ్రాయర్లు రెండూ లాగాడు. ఆ గట్టిగా లాగటంతో ఒక సొరుగు దభేలున క్రింద పడ్డది, "శారదా! శారదా!" అని గట్టిగా కేక వేశాడు.

వంట యింట్లోనుంచి శారద మెరుపు మెఱిసినట్లు ప్రత్యక్షమైంది. ఆమె గుండె కొట్టుకొంటూవుంది. ఆమె కళ్ళుమాత్రం పిశాచపునవ్వు నవ్వుతున్నాయి.

"ఏమయ్యాయి?" అన్నాడు ఆవేగంతో వెంకట్రావు.

"ఏమిటీ?"

వెంకటార్రావు మనస్సు ఉడికిపోతున్నది. ఒక్కసారి

శారద ముందుకు దూకి బుజాలు రెండూ గట్టిగా పట్టుకొని ఊపుతూ, "నా పుస్తకాలు. నా వ్రాసుకొన్న వ్యాసాలు.

"ఏం పుస్తకాలు"

"ఏం పుస్తకాలా?......నా శాఫో, నా హోమర్, నా యూనటోల్ ఫ్రాన్స్, నా రోమేరోలా.—"

"నాకేమ్ తెలియదు."

"ఏమీ తెలియదూ? నా కథలు, నా నాటకాలు, నా పద్యాలు, ఏమీ తెలియదు? ఏంచేశావ్?" అని గట్టిగా వూపి వెనక్కు నెట్టాడు. గదంతా పచారు చేసి మళ్ళీ శారదవంకకు చూచి "ఏమయ్యాయి?"

శారదకు కోపం వచ్చింది. "ఏమయ్యాయూ? అన్నీ కాగితాల పొట్లాల కమ్మివేశాను."

వెంకట్రావు స్తబ్ధుడై పోయాడు. ఎర్ర కన్నులతో రెండు నిమిషాలట్లే చూచాడు. కోపం జారిపోయింది. ఒడలు కుంచితమైపోయింది. కన్నులు జాలిగా "నిజమేనా?" అని ప్రశ్నించాయి.

ఆస లుడిగి మీదకు తిరగబడ్డ లేడిలాగా శారద తిరగబడింది. "ఇందుల్లో ఒక్క మాటకూడ పొల్లులేదు. నిన్ను ఏడ్పించాలనే అన్నీ అమ్మివేశాను. నా కసి తీర్చుకొన్నా."

"నీకేమి అపకారం చేశాను?"

"నేను పెళ్ళి చేసుకొన్నది ఈ వెంకట్రావుని కాదు. వీడు వట్టి మూర్ఖుడు. వట్టి స్వార్థపరుడు; నీచుడు. ఆనాటి వెంకట్రావు అలా కనపడలా. అతనికి ఇంత ఆకలి— ఇంత కుటుంబ ధ్వంసం చేసే ఆకలి, ప్రపంచాన్నే ఒక్క

కబళంలో మింగేశావే—అతని మనస్సులో అంతర్యాభతమై వున్నదనుకొంటే పెళ్లి చేసుకొనే దాన్ని కాదు. ఏం చేశానంటావా? [illegible] మ్యూలేసు? ఇంట్లో తిండికి లేక అల్లాడుతూంటే పుస్తకాలు కట్లకు కట్టలు దిగుతుంటాయ్. నోట్సూ [illegible] చేసుకు; సిగరెట్టు పీకలూ. ఎప్పుడూ చదువు. [illegible] ఏమైతే నేమ్? కూతురెట్లా పోతేనేమ్? మా నాన్న, అమ్మా ఇచ్చిన డబ్బు కాస్తి కాఫీ హోటలు బిల్లులకీ సిగరెట్లకూ సరిపోయింది. నా సర్వస్వాన్ని [illegible] త్యాగం చేశాను. నా హృదయాన్ని, నా శరీరాన్ని నీ [illegible] ఆ త్యాగంలోనే సంతృప్తి చెందాను. ప్రతిఫలం [illegible] నవ్వైనా లేకపోయింది. డైరీలో ఏం [illegible]? నేను పట్టి కరూపినా? ప్రపంచంలో అనంతమైన సౌందర్యమేదీ? ఆ సౌందర్యంకోసం గుటకలు మింగుతూ [illegible]స్తావా?— నీ వెట్లా మరణిస్తే నాకేం? నా [illegible]లు నాకిచ్చివేసెయ్. ఐదు నెలలై[illegible]యాయి." అన్నది.

ఒక్క సారి వెన్కట్రావుకు భగ్గుమంది. "యూ షీ డెవిల్ గెట్ అవుట్" అన్నాడు.

తలుపు దభాలుమంది. అతని కన్నుల్లో చీకట్లు కమ్మాయి. గదిలో వున్న మంచంమీదికి కూలబడ్డాడు. మనస్సు గిర్రున తిరిగిపోతున్నది. కళ్ళు గట్టిగా మూసుకొన్నాడు. మనోవీధిలో పూర్వపు పుస్తకాలు ఊరక అర్రాడుతున్నాయి. చేత్తో లలాటాన్ని గట్టిగా అదిమాడు. మంచంమీద పొర్లిగింతలు పెట్టాడు. లేచి కూర్చున్నాడు.

మళ్ళీ పడుకొన్నాడు. కొంచంసేపటికి సర్వం మరచాడు. నిద్రాదేవత ఆకలితోను ఆవేగంతోను డస్సిపోయిన అతని తనువును కౌగిలించింది.

# ప్రూఫ్ రీడర్

ఉద్యోగం కాస్తా ఊడింది. అది నాగరాజు చేతులార చేసుకొందే. అసలు మొదటినుంచీ అతని అభిప్రాయాలు ఆశయాలు వేరు. పొంతలేని కాలం అతని జీవితాన్ని ఆ విధంగా ప్రెస్సువాళ్ళ ఓటికుర్చీకి అంకితం ఇచ్చి మోస పుచ్చింది గాని, నాగరాజు 30 సంవత్సరాల జీవితంలో ఏ నిమిషానా కూడా కలనగా గానీ, కలగా గానీ, లోకాని కేదో మహోపకారం చెయ్యటానికి పుట్టిన తను, కార్లల్లో మేడల్లో, భోగాల మధ్యా తిరుగుతా ననుకున్న తను, అట్లా ప్రెస్సులో చాక్లీ మొహాలలో గుడ్డలన్నీ మసి బూసుకొని కళాహీనంగా, జీవంలేకుండా, పేద వడ్డ కోర్కెలలో, ఆ సీసు గుండ్ల జిగుర్ల మధ్య కుర్చీకి అతుక్కు పోయి ఆవలిస్తూ బతకలేక బతుకుతాననుకోలా.

ఇష్టంలేని వుద్యోగంలో అంటిపెట్టుకొని వుండామన్నా ఎక్కువ కాలం ఉండలేకపోయాడు. ప్రొద్దున్నే రాంగానే ఆ దయ్యం కంపోజిటర్సు. ఆ చిందరవందర కాయితాల కట్టలూ, పుస్తకాలు, ఆ ఓటికుర్చీ చూడగానే పిచ్చెత్తేది. పోతూ పోతూ ప్రెస్సువాళ్ళతో పోట్లాడి తన వుద్యోగం మీదా ఓటి కుర్చీమీదా వున్న కోపాన్ని, వుడుకుబోతు తనాన్ని వెళ్ళబోసుకొని మరీ బయటబడ్డాడు.

ఏ ప్రపంచ భుజాన వేసుకొని ప్రెస్సులో కాలు పెట్టాడో ఆ భుజాన ప్రపంచతోనే బయటకు దాటాడు. ప్రెస్సు దాటి యివతల బడగానే మొదట తగిలించిన వురి

తాడు తప్పించుకోన్నంత తేలిక అయింది నాగరాజుకు.

కాని ఎటూ పోటానికి కాలాట్టంలా. వుద్యోగం వూడులుకున్నందుకు ఏమీ విచారం లేదు గాని ఆ చలి జ్వరంతో బాధ పడుతున్న భార్యకు క్వినైను సుంకూ, వులెన్ స్వెట్టరు తెచ్చిపెడతానన్నానే, చేతిలో దమ్మిడి లేదు, ఎట్లాగా అని చెల్లని మొఖం వేసి అటూ యిటూ తచ్చెర్లాడాడు. ఆ వేళ ప్రెస్సువాళ్ళతో పోట్లాడి వుద్యోగం వూడులుకొని రాకుండా వున్నట్లయితే కాబోయే నెల జీతంలో కాస్తో కూస్తో అడిగి పట్టుకుపోయి కొనేవాడు.

ఎకాయెకి రమణరావింటికి పోయాడు.

"ఓహో ప్రూఫ్ రీడర్!"

"రమణీ! డబ్బు కావాలి."

"అంతకు తక్కువ పనికి ఎప్పుడూ రావుగా!"

"పది రూపాయలు కావాలిప్పుడు."

"ఇరవై ఒద్దూ?" నవ్వాడు రమణరావు.

"ఇంటికి త్వరగా పోవాలి. అనసూయకు చలిజ్వరం."

"చెప్పవేం, అయితే త్వరగాపో." లోపలకు పోయాడు రమణరావు

నాగరాజు డబ్బు కక్కుర్తిపడే సంగతి రమణరావుకు తెలుసు. భార్యకు యివ్వడు ఏమందో తీసుకు పోటానికి డబ్బులేక వచ్చాడని గ్రహించాడు రమణరావు. లోపలినుంచి తిరిగి వచ్చి రెండు పది రూపాయల నోట్లు చేతిలో పెట్టాడు.

"ఎందుకు పది చాలు," అన్నాడు నాగరాజు.

"పరవాలేదు లే." కూర్చున్నాడు రమణారావు.

"ఒకటి చాల్లే," అంటూ ఒక పది రూపాయల నోటు రమణరావు ఒళ్లో పెట్టి లేచాడు నాగరాజు.

"నీ ప్రూఫ్ రీడింగ్ మెంటాలిటీ పోనివ్వక పోతివి!" పది రూపాయల నోటు మడిచి జేబులో పెట్టుకున్నాడు రమణారావు.

నాగరాజు గబగబా పెద్దబజారుకు పోయాడు. స్వెట్టరూ, క్వైనెను, నాలుగు కమలాలు కొని యింటికి బయలు దేరాడు. మనస్సంతా చికాకుగా వుంది. ఉద్యోగం వూడి పని పెదిమల మీదికి వచ్చిన మాటనే రమణారావుతో చెప్పకుండా ఎందుకు దిగమింగాడో అతనికే అర్థం గాలా. ఆ Psychology అట్లా ఎందుకు work చేసిందో Psychology student నాగరాజుకే బోధపడలా.

ఏం? వుద్యోగం ఎగిరిందని చెపితే పదిరూపాయలు అప్పు పుట్టనివ్వడన్న భయంచాతనా? రమణరావు ఎట్లాంటి వాడయిందీ తను ఎరక్కపోతేగా. ఇదివరకు ఎంత బాకీ వున్నాడో తనకే తెలుసు, రమణరావుకే తెలుసు. పెద్ద బజారు దాటి పోతున్నాడు. ఎదురుగా వచ్చి నిలబడ్డాడు సుబ్బారావు.

"ఎవరు. సోషలిస్టా!" సుబ్బారావు చెయ్యి పట్టుకొని సాగాడు నాగరాజు. సుబ్బారావు నాగరాజుకి కాలేజీ స్నేహితుడు.

"రేపు రష్యన్ డే. ఉత్సవాలు, వూరేగింపులు అన్నీ అయాక పార్కులో మీటింగు వుంటుంది. కార్మికోద్యమ

చరిత్ర నంతా సంక్షిప్తంగా చర్చిస్తారు. నా వుపన్యాసం గూడా వుంటుంది, వస్తావు కాదూ?" అడిగాడు నాగరాజును.

"అవునుగాని యీ కృషీకులంతా ఆర్థిక రాజకీయ సమస్యల్ని వొదిలి స్నానం చెయ్యటంమీదా, భాషను పరిశుభ్రంగా వుచ్చరించటంమీదా ప్రచారం సాగిస్తే సమానత్వం నిమిషాలమీద వస్తుంది సుబ్బారావు." ఇద్దరూ నవ్వుకున్నారు,

"పోతా, ఏదీ పర్సు?" నాగరాజు పర్సుతీసి ఒకరూపాయి పుచ్చుకొని తిరిగి పెద్దబజారుకు పోయాడు సుబ్బారావు.

"హుః! సోషలిస్టు!! యీపద్ధతి బాగానేవుంది.సోషలిస్టు సిద్ధాంతాలు, భాగ్యవంతురాలు భార్య; ఎవరన్నా పెళ్ళిగాని కాలేజీ పిచ్చిపిల్ల దొరికితే సోషలిజంచేసి చూపెట్టాలంటూ జట్కా బండిలో అటొక చడా కామ్రేడ్ యిటొక బడా కామ్రేడ్ మధ్య అమ్మాయిని ఎక్కించుకొని వూరంతా బీరుపోకుండా గస్తీ తిరిగే పోలీసాడి కన్నా ఎక్కువ శ్రద్ధపుచ్చుకొని తిండీ తిప్పలు లేకుండా తిప్పి ఎట్లా అయితేనేం ఆపిచ్చి పిల్లకు పెళ్ళి కానీకుండా చెయ్యటం. ఇదీ వరస."

సినిక్ లాంటి నాగరాజు హృదయం సైతం చలించింది సోషలిజం పుచ్చుకుందామూ అని. అనసూయ చలి, జ్వరం జ్యోతిర్మయములైన అనసూయ అమాయికపు మూగచూపులూ, అద్దె కట్టలేదన్న కోపజ్వాలల్లో మండిపోయే ఇంటావిడా, ఎవ్వరూ, ఏదీ, గుర్తు రానంతవరకూ తను గూడా సోషలిజం పుచ్చుకుంటే బావుంటుం దనిపించింది.

అనసూయకూడా, వెయ్యికన్నులు లేవుగాని వున్నంతగా, వుత్సాహంగా, ఎదురుచూస్తోంది, అతని కొరకు. తనకొరకు నాగరాజు పడుతున్న కష్టాలన్నీ, జాలిగా, బాధగా ఆలోచించింది. తన సౌఖ్యం కోసం నానా అగచాట్లూ పడుతున్న పిచ్చి నాగరాజు తననుంచి ఏమి అపేక్షిస్తున్నాడో అర్థంగాక వేగిపోయింది. లోకంలో ఎంత మందికి భార్యలు లేరు? ఎందరు భర్తలు పశువులుగా, స్వార్థంతో, రసికత్వంలేని తృష్ణకోసం, స్త్రీని సాధనంగా, పనిముట్టుగా, చొక్కా మాదిరిగా, వాడుకొంటూ, కోరిన అనుభవాన్ని, సుఖాన్ని యిస్తున్నారు గదా అన్న సానుభూతైనా లేకుండా, కొనుక్కున్న చొక్కా చిరిగిందాకా తొడిగేదే అనే లెఖ్ఖలో భార్యాలను వాడుకోవటంలేదు?

ఇంటికిపోగానే, తనే అనసూయకు స్వెట్టరు తొడిగాడు. క్వినైను యిచ్చింతరువాత కమలాలు, ఒక్కొక్కటే వొలిచిస్తే, అనసూయ తింటూవుంటే, మెల్లిమెల్లిగా వుద్యోగం వొదులుకున్నానని చెప్పాడు.

"అనూ! మనం పుట్టింది యీముప్ఫై రూపాయలతో ప్రాణాలు పోసుకుంటానికి కాదు."

"నాగరాజూ, వుద్యోగం వొదులుకున్నావా! ఈకాస్త బ్రతుకుదెరువుగూడా పోగొట్టావా?" నసూయ కంఠం మెత్తబడింది. ఉద్యోగం వొదులుకో వద్దని అంటానికి తనకేమి అధికారం వుంది. తన సౌఖ్యంకొరకు యిష్టంలేని వుద్యోగాన్ని తిరిగి స్వీకరించమని నాగరాజుతో అనలేకపోయింది. కాని ఎప్పుడూకూడా ఒకజీవి సౌఖ్యంకోసం

పదిజీవులు నలగిపోవటమే మానవ చరిత్ర. మానవ చరిత్రలోని ఆదర్శమే అంతలో వుంది.

"అనూ! ప్రూఫ్‌రీడరు చెయ్యడానికి కాదు నీ నాగరాజు పుట్టింది. ఏమి చెయ్యటానికి పుట్టాడో యిప్పటికి తెలుసుకు న్నాడు." వచ్చిన వుద్యోగాన్ని వుంచుకుందామని కే పుట్టా నని యింత ఆలస్యంగా గాని తెలుసుకోలేక పోయాడు నాగరాజు. భోజనమదీ అయింతరువాత చాలీచాలని ఆ అద్దె కొంపలో ఒకళ్ళ అవయవాల స్పర్శ ఒకళ్ళకు ఆనందా న్నిస్తోంటే అనసూయ సాగసైన మెడవొంపు హాయిలోతన ముఖాన్ని దాచుకొంటో, వులెన్ స్వెట్టరులో దాగిన వేడి వక్షం నాగరాజు హృదయాన్ని హత్తుకొని అడుగంటిన అతని ఆశయాలను రేకెత్తిస్తోండగా వొడిగి నిద్రపోయాడు.

## 2

తనదగ్గరా యింట్లోనూ అంతాకలిసి నిలవున్న ఐదు రూపాయల కాపిటల్‌తో నాగరాజు తన నూతన జీవితాన్ని ఆరంభించాడు. లాటరీ టిక్కెట్టు కొన్నదగ్గరనుంచి రోజులు లెక్క పెట్టుకుంటూ ఎదురు చూస్తున్నాడు. నాగరాజు అదృష్టదేవత కొరకు. కాని అదృష్ట దేవత వచ్చేంతవరకూ గడవని జీవితంకొరకు, నిలవని ప్రాణాల కోసం వేరుమార్గం తోచటంలా. హృదయంలోని వుద్దే శ్యాన్ని వెల్లడి చేసే నిబ్బరం కొరకు యుద్ధం చేశాడు.

చాలాసార్లు అనసూయను సమీపించే ఆమూగ

కన్నుల్ని, ఆ మోాయ లేసి చూపుల్ని చూసి గిర్రున వెనక్కి తిరిగాడు. బైటకు లోపలకు వెళ్లేప్పుడు ఎదటబడ్డా, నెల అయిపోయినా యింకా అద్దె యివ్వలేదన్న మంటచేత పలకరించకుండా తిరస్కారపు చూపులు చూసే యింటావిడను తలచుకొన్నప్పుడల్లా నాగరాజు గుండెల్లో దడ పుడుతుంది. ఆమెను చూట్టానికే భయమేస్తుంది. ఎప్పుడు బజారుకు లాగుతుందో నని ప్రతి క్షణమూ గుండె దిగులు.

బైట బండి ఆగిన చప్పుడు. నాగరాజు లోపలకు వచ్చాడు. తరువాత అనసూయను బండి ఎక్కమను పోయాడు. ఎక్కడకు తీసుకు పోతున్నాడో అనసూయకు అర్థంగాలా. రోజూ చిరునవ్వు కెరటాల్లో చిందులాడే నాగరాజు మోము ఆ రోజున అప్పుడా బండిలో, గాంభీర్యంపు ముసుగులో నిదాఘ సీరంధ్ర భయద జీమూతాళితో ఆచ్ఛాదితమై వుంది. దారి పొడుగూతా తల వంచుకొనే అనసూయవంక చూడకుండానే వున్నాడు. అనసూయకు అంతా అయోమయంగా వుంది.

నాగరాజు మౌనంగా అనసూయను వెంట బెట్టుకొని ఓ యింట్లో ప్రవేశించాడు. ఇల్లు చిన్నదే కాని అందంగా వుంది. ఓ యిరవై మూప్పయి సంత్సరాల యువకుడొచ్చి వెనక వరండాలోకి తీసికెళ్లాడు. యువకుడు అందంగా లేకపోయినా ఆకర్షవంతంగా వున్నాడు. ఆ చుట్టూవున్న బొమ్మలు, పెద్ద పెద్ద పటాలు, వలురకాలైన ప్రకృతిచిత్రాలు అన్నీ చూసి యీ పటాలమ్ముకొనే కొట్టుకు తన్నెందుకు తీసుకు వచ్చాడో అనసూయకు బోధ

పడలా.

అందమైన ఓ జపాను చాపేసి అనసూయను కూర్చోమన్నాడు యువకుడు. తనకు ఓ కొత్తమనిషి పరిచయం లేని తన్ను మర్యాద చెయ్యటం చూసి నాగరాజు మొఖంలోకి చూసింది.

"అనూ! కూర్చో," అన్నాడు నాగరాజు. అనసూయ కిక్కురు మనకుండా కూర్చుంది.

"సిటింగుకు పది రూపాయలేగా" అన్నాడు యువకుడు నాగరాజువంక చూస్తో. కదిలీ కదలకుండా, మెల్లగా తలూపాడు నాగరాజు. ఆ రంగులూ, కుంచలూ, ఆ అట్టలూ, పెన్సిళ్లు, చూసి గాభరాపడింది అనసూయ. తనబొమ్మ గీస్తానికే తెచ్చాడని అనసూయను ఓ పోజులో యువకుడు కూర్చోబెట్టేంతవరకూ తెలీలా. తన బొమ్మను తన భర్త ఎదుట పరాయిమగాడు చిత్రించటమా?

అనసూయ కాళ్ళూ చేతులు వొణికాయి. నడిబజారులో చీర ఒలిచినట్లయింది. బొమ్మ తయారు చేసేంతవరకూ మొఖం చెల్లక నాగరాజు తల వంచుకొని కూర్చొన్నాడు మొదటిసారి జైల్లో బడ్డ ఖైదీమాదిరిగా, లేడీ స్టూడెంటు వంక దొంగ చూపులువేసే విద్యార్థి పట్టుపడ్డప్పుడుగా.

చిత్రాన్ని ఒక గంటలో చిత్రించాడు ఆర్టిస్టు. అవకాశాల్లేని ఆంధ్రా ఆర్టిస్టులో అణిగిన ప్రతిభనంతా ప్రదర్శిస్తోందన్నంతగా వుంది అనసూయ చిత్రపటం. ఒక్క గంటలో పదిరూపాయల సంపాదన. భార్య ఆనందాన్ని, అందాన్ని, మానాన్నీ— అనసూయనే అమ్ముకొచ్చిన సంపాదన,

నాగరాజు కష్టార్జితం ఆ పదిరూపాయలూ. దాని పొదుగూతా, యింటికి పోయేంతవరకు గుఱ్ఱబ్బండి గతుకుళ్ళకు జేబులో మాటిమాటికి ఘల్లుఘల్లున మోగుతూనే వుంది. ఒక్కొక్క మోతకు ఒక్కొక్క శరంతో కొట్టినంత బాధగా వుంది నాగరాజు హృదయంలో.

రాను రాను అలవాటై పోయింది. యిప్పుడు సిటింగుకు అనసూయా నాగరాజులు నవ్వుకుంటూ సరదాగా పోతున్నారు గుఱ్ఱబ్బండిలో. సునాయాసంగా అరవై రూపాయలు సంపాయించారు. కాని లాటరీడబ్బు ఎప్పుడు వస్తుందా అని కనిపెట్టుకున్నారు, యీ వేధవ సిటింగులకు స్వస్తి చెప్పటానికి. ఆవేళ అనసూయను ఒక్కదాన్నే పంపాడు గుఱ్ఱబ్బండిలో, నాగరాజు కొంచెం సుస్తీగా వుండి.

అది ఏడో సిటింగు. అనసూయకు సిటింగు అలవాటై పోయినా నాగరాజు లేకపోయే సరికి కొంచెం పీనకాడుతూనే వుంది మనస్సు. కాని ఆర్టిస్టు చాలా పెద్దమనిషి. మర్యాద తెలిసిన దయగలవాడు కూడాను. బండి ఆగింది. అనసూయ ఒక్కర్తే దిగటం చూశాడు ఆర్టిస్టు. మామూలుగానే అనసూయను వరండాలోకి పంపి యింటి ముందు వాకిలి బిగించి వచ్చాడు.

ఏమీ కొత్తలు లేవు. ప్రతి సిటింగుకూ నాగరాజు వున్నప్పుడుగూడా అట్లాగే బిగించి వచ్చేవాడు ఎవరన్నా లోపలికి వస్తారేమో నని. కాని నాగరాజు లేని యీ దినాన అట్లా గడి బిగించుకొని యిద్దరే యింట్లో వుంటం, ఆర్టిస్టు ఎంతో సత్ప్రవర్తన గలవాడని తెలుసుకున్నప్పటికీ

అనసూయకు భయంవేసింది. ఆర్టిస్టు వరండాలోకి వచ్చాడు.

అనసూయ అతని వంకైనా చూడలేక పోయింది. మామూలుగానే జపాను చాపవేసి "తయారుగా వున్నారా" అన్నాడు ఆర్టిస్టు. అనసూయకు యీ మాట కొత్తగా తోచింది. వెధవ ముక్కి శరీరాన్ని కాపాడుకోటానికి ఎటు వంటి పనులు, ఎటువంటి మాటలు వినాల్సి వచ్చిందీ, అని 'కుయ్యో కుయ్యో' మని ఏడ్చింది అనసూయ అంతరాత్మ. ఏమీ బదులు చెప్పకుండానే చాప మీద కూర్చుంది అనసూయ.

"ఇవ్వాళ నూడ్," అన్నాడు తిరిగి ఆర్టిస్టు. అంటే ఏమి టని అడిగింది అనసూయ వంచిన తలతో.

"అంటే నగ్నచిత్రం," అని అనసూయ మొఖంలోకి చూశాడు ఆర్టిస్టు. ఇంకా అనసూయకు అర్థంకాలా. కాని మామూలుకంటే యీ రోజు ఏదో కొత్తది చెయ్య బోతున్నాడని దడదడ కొట్టుకుంది అనసూయ హృదయం. ఇంకా అర్థం గాలేదని గ్రహించి "మీరు యివ్వాళ వివ స్త్రలై కూర్చోవాలి సిటింగుకు" అన్నాడు ఆర్టిస్టు. సూర్యోదయ కాలంలోని తూర్పువైపు ఆకాశం అయింది అనసూయ ముఖం, ఆమె హృదయంలో యినప మనిషి నృత్యం చేశాడు.

చూపులకు, కోపాలకు దగ్ధంచేసే ఋష్యఋషుల కమ్మ కోవుంటే అనసూయ చూపులకు ఆర్టిస్టు మాడి మసి అయ్యే వాడు. చంద్ర కిరణాలకు అరువు తెచ్చుకుందామన్నా ఎరువు జీరలు రావు. నాగరాజు రాని సమయం చూచి

ఎప్పుడు తన పన్నుగడ నెగ్గించుకుందామా అనుకుంటున్న ఆర్టిస్టు "నాగరాజుగారు నిన్న ఒప్పుకుపోయిండే. సిటింగుకు 25 రూపాయలు," అని అబద్ధ మాడాడు.

నాగరాజు నిజంగా యింత మోసం చేసుంటాడా అన్న అనసూయ అనుమానానికి, ప్రతి సిటింగుకూ వచ్చే నాగరాజు ఆవేళ రాకపోవటం దోహదమయి బలపరచింది. వెధవడబ్బు కోసం తన మానాన్ని అమ్మాడా భర్త? విద్యను, కీర్తిని, భాగ్యాలను, అందాల్ని, ఆడవాళ్ళని కొనే డబ్బు నాగరాజు భార్యనుకూడా కొనేసిందా? నాగరాజా యిటువంటి నీచానికి పూనుకుంది.

తన ప్రాణాలకన్నా, ప్రపంచానికన్నా, ఎక్కువగా ప్రేమించే అనసూయను, తిండి తిప్పలు మాని అనసూయ అందాన్ని తిని బ్రతికే నాగరాజు, యితరులు ఎప్పుడు దొంగిలిస్తారో తన అందాల కుప్ప అనూస, అని అహర్నిశాలు అంటి పెట్టుకొని ఆనందపు మడతల్లో మూర్ఛలు పోయే నాగరాజు — యింత కాఠిన్యంగా, మాలిన్యంగా, మానవుడుగా, ప్రవర్తిస్తాడా? సామాన్య మానవుడు సైతం అమ్మడే భార్య మానాన్ని? భర్త ఆజ్ఞలను ఎదురాడని తను, యిష్టంలేక పోయినా తనసౌఖ్యంకొరకు ప్రూఫ్‌రీడర్ ఉద్యోగం చేసిన నాగరాజుయిష్టాన్ని కాదంటానికి హక్కు లేదనుకుంది. అసలు స్త్రీగా పుట్టినపుడే పోయింది ఆ హక్కు. అందులో భారత దేశంలో పుట్టిన తను, సీతా సావిత్రులు మొదలుగాగల పతివ్రతలు జన్మించిన యీ పవిత్రభూమిలో పుట్టి భర్త ఆజ్ఞను ఎదురాడుదామనే

తలంపా! ఎంత ధైర్యం!! ఎంత నీచం!!!

నాగరాజు యిష్టాన్ని నెరవేర్చటమే తనవిధి అనుకుంది. హృదయం మాత్రం ఎదురు తిరుగుతోంది కాని ఏకోర్టువారో, ఏకాంగ్రెసు గవర్నమెంటో, పతివ్రతా నియమాల్లో కొన్ని మార్పు, చేర్పు, సంతకాలు చేసి, శాసనంగా చేసేంతవరకూ, స్త్రీకి హృదయం వుంటం సహించలేని ముసలిమగాళ్ళు ఒప్పుకొనేంతవరకూ, అనసూయా హృదయానికి చెలామణి లేని మాహాత్మ్యం లేని మూగ హృదయం. కొంచం కొంచంగా తలెత్తుతోన్న హృదయాన్ని తొక్కి ఓనమాలు దిద్దింది అనసూయలోని పతివ్రతాయంత్రం.

హృదయం కిక్కురుమనకుండా వూరుకుంది. తలవంచుకొని ఒకప్రక్కకు వొరిగి వొణుకుతూ చీర విప్పేస్తుంది యంత్రం. ఓరగా పండుకోవాలని చేసి చూపించాడు ఆర్టిస్టు జయభేరి మోగిస్తూ.

అదే పోజులో ఓ చేతిమీద తలఆనించి విశాలమైన వెంట్రుకలతో ఉన్నతమైన వక్షాన్ని కప్పి, రెండో చెయ్యి అడ్డుపెట్టి భారత స్త్రీ మానాన్ని సభ్యతా ప్రపంచపు నాగరకతకు బలికాకుండా కాపాడ చూసింది. కళ్ళు మూతలు పడ్డయి.

కాయితంమీద కలం పెట్టాడు ఆర్టిస్టు. ఆ చేతో గీసిన ప్రతిగీతా వణుకుతూంది. స్వార్థ భూయిష్టమైన కళా హృదయం వుప్పొంగి రాజ్యం చేస్తోంది. ఆనంద రసాస్వాద కళాహృదికి అనసూయ రెండో చెయ్యి చూసి కన్ను

గుట్టింది.

"చూడండి, ఆచెయ్యి తీసి కొంచం ముందు చాపమీద ఆనించాలి. ఇదుగో యిట్లా."

చెయ్యి తియ్య బోయింది యంత్రం. భగ్గున మండింది హృదయం. చెయ్యి తీసింది అనసూయ. ఆర్టిస్టులోని ఉన్మాది ఒక్కసారిగా విజృంభించి కమ్ముకొన్నాడు. పటాపంచలై, తునాతునకలై, ఫెళ ఫెళార్భటులు చేసింది అనసూయలోని పతివ్రతా యంత్రం. జాలిగా, బాధగా వికలమైంది అనసూయలోని మానవ హృదయం. తుంపులైన యంత్రంలోనుంచి మొలకెత్తింది మానవహృదయం లోని చీలిక. రెండు హృదయాలూ కలిసినై. ఒకటిగా, ఉచ్ఛస్థితికి, ఉన్నత స్థాయికి పోయి ఆగింది అనసూయ హృదయం. కాని అనసూయలోని సీత, అనసూయలోని సావిత్రి దగ్ధం చేసింది ఆర్టిస్టును. గొంతుదగ్గర నొక్కుకు పోయిన గంట్లతో అనసూయ శవం ప్రక్కనే పడింది ఆర్టిస్టు శవం.

ఏకల్మషం ఎరగని నాగరాజు, మామూలు సిటింగుకు పంపిన నాగరాజు, సాయంత్రం అయినా, పొద్దుగూకినా, అనసూయ రాకపోవటం చూచి కలవర పడ్డాడు, కలత చెందాడు. దానికితోడు, ఎదురుచూస్తున్న తన జీవితాశయం కొరకు, లక్షరూపాయల బహుమానం తెస్తుందనుకొన్న లాటరీ తెల్లమొఖం వేసుకొచ్చింది. ఈనిరాశను భరించలేని హృదయాన్ని ఆర్టిస్టు యింటికి జారేశాడు నాగరాజు.

వాకిట్లో గుర్రబ్బండి లేదు. తలుపు తట్టాడు. గడి

బిగించి వుంది. నాగరాజుకు ఆతురత ఎక్కువైంది. ఇంటి వెనకభాగానికి పోయి అటూ యిటూ పరికించి ఎత్తైన కాంపౌండు గోడను ఎక్కి, ఎగిరి, దూకాడు లోపలకు. వరండా వైపు చూచి తనకళ్ళు తనవి కావేమో ననుకున్నాడు. తన జీవితాదర్శం, తన అమాయిక అనూ, తన అందాల కుప్ప అనసూయ, తన భాగ్య, తనహక్కు, తనభుక్తం, నగ్న శరీరం చేసుకొని వెధవ ఆర్టిస్టు ప్రక్కన మైమరచి నిద్రపోవటమా!!!

నమ్మలేకపోయాడు. దగ్గరకు వెళ్ళాడు. పరికించి చూసి యిద్దరినీ కొట్టాడు అప్పుడు అర్థం చేసుకుంది, నాగరాజు హృదయం. శరీరాన్ని ఆ రెండు కళేబరాల మధ్యే యిరికించి, నాగరాజు పవిత్రహృదయం ఆయిద్దరి మధ్యా, అంతటా, అన్నిటా, తమస్సులో, ఉషస్సులో, జ్యోతిలా, జ్వాలలా, వెలిగింది, కరిగింది.

# పుస్తకాల అమ్మేవాడు

ఆ పుస్తకాలమ్మేవాడు రామవరప్పాడు స్టేషన్లో మా బండి ఎక్కాడు. బండి కదలగానే, ఒక మూల నిలబడి ఒక పుస్తకం తీసి "యం. ఏ. లు. బి. ఏ. లు ప్యాసయి, నాగు," అని పాడటం మొదలు పెట్టాడు. ఆ పాడే ధోరణిలో ఒక వింత ఆకర్షణ వుంది. మా పెట్టె క్షణంలో నిశ్శబ్ద పూరిత మైంది. ఆ నిశ్శబ్దంలో ఖంగుమని వినిపించే వాని కంఠధ్వని ఎవ్వర్ని ఆకర్షించదు? నేను విననట్లు నటిస్తూ సావధానంగా వింటున్నాను.

"చెట్టుకింద ప్లీడర్లు
గట్టుమీద ప్లీడరు
కల్లబొల్లి మాటలాయె
ఇల్లు వల్లు గుల్లలాయె!"

అని సాగించాడు. ఆ పాట సారాంశం యిది. ప్లీడరు పరీక్ష చదివి, ఇల్లు గుల్లచేసి, ఎవ్వరింటికైనా చెక్కి కొడుతారు. ఇంటి దగ్గర 'భార్యాలలాను' పోరు పడలేక కోర్టుకి వెళ్తారు. అక్కడ 'బారు రూము'లో పడి నిద్రపోతారు. సాయంకాలం అయిందంటికి ఆపసోపాలు పడుతూ కొంపకి చేరతారు. "మా ఆయన కష్టపడి వొచ్చాడమ్మా!" అని భార్య ఆదరిస్తుంది... ఇంటి ఖామందు అద్దె అడిగితే, ఆరు నెల్ల నోటీసు ఇవ్వలేదు. నేను ఖాళీ చేయను, ఏమి చేసుకుంటావో చేసుకో" అంటారు.—చేతిలో పడ్డవాళ్లను పిల్చి పిప్పి చేస్తారు. తిరుక్షవరం చేసి పంపుతారు.—

ఘ్రాణసక్తి మాత్రం తక్కువ ఉండదు. నోట్లో సిగరెట్లు, ప్రక్క ప్రాంగులు, మధ్యపాపట్లు—."

రైలు పెట్టె లోని జన మంతా నన్ను చూచి గొల్లున నవ్వారు. నా నోట్లో సిగరెట్టూ, నా మధ్యపాపటి, (బహుశా నా మొహం ప్లీడరు మొహంగా ఉందేమో)- నా మొహం జేవురించింది. "అకౌంటు వెధవ చేశాడు. డబ్బు లేదని మూడో క్లాసు టిక్కెట్టు కొన్నాడు. లేక పోతే నా తాతలనాడు ఎక్కారా, నా తండ్రులనాడు ఎక్కారా, ఈ మూడోతరగతి!" అని గొణుగుకొన్నాను. గబగబా కాగితాలు తీసుకొని ఏదో చదువుతున్నట్లు నటించాను.

పుస్తకాలమ్మేవాడు పాడుతూనే ఉన్నాడు. వాని మాటలు చెవుల్లో గింగురు మంటున్నవి. నా అదృష్ట వశాత్తు వాడు ప్లీడర్ల అధ్యాయం ముగించి స్త్రీల అధ్యాయంలోకి వచ్చాడు. నేను కాగితాలు అడ్డుపెట్టుకునే వింటున్నాను.

"చంక చేతుల జాకెట్లు
చంటి మెడల జాకెట్లు
ముక్కు పుడకలు మోటాయె
వాలుచూపులు మెండాయె!"

నేను ఆకర్షించ బడ్డాను. అప్రయత్నంగా కాగితాలు మడిచి, శ్రద్ధగా విన్నాను. ఈ అధ్యాయం సారాంశం కూడా చెబుతాను. కుచద్వయం కనుపించే చేతులు గల జాకెట్లు—ఒక కుచం కనుపించేటట్లుగా రెండో కుచం

మీదనుంచి పోయే పమిట......"

పెట్టెలోని జనమంతా సంతోషంతో విరగబడి నవ్వారు. కొందరు చిరునవ్వులతో గుసగుస లాడుతున్నారు. కొందరు "చూడు" అన్నట్లు సైగలు చేసుకున్నారు. "బానే ఉంది. అందులో ఒక్క అబద్ధం లేదు," అన్నారు కొందరు. ఒక ముసలివాడు తన్మయత్వంతో తలూపుతూ పుస్తకాలమ్మే వాడి పాటకు తాళం వేశాడు. "నాకొక పుస్తకం నాకొక పుస్తకం" అని ఆపుస్తకాలన్నీ క్షణంలో కొనివేశారు. నా ప్రక్కన కూర్చొన్న హరిజన బాలిక భర్తతో, "ఒక పుస్తకం కొను" "పిచ్చాయి కూడా చదువు కుంటాడు," అన్నది. అనివాడు రెండుపుస్తకాలు కొన్నాడు. నాకూ కూడా ఒక పుస్తకం కొనాలనిపించింది, కాని నేను (ప్లీడర్ని; ఆర్టిస్టుని) ఈ అర్ధణా పుస్తకం, ఇటువంటి పుస్తకం కొంటుంటే ఎవ్వరయినా చూస్తే! ...(వచ్చే టప్పుడు వీడు ఒంటరిగా కనబడితే తప్పకుండా కొనాలని నిశ్చయించు కున్నాను.)

ఇంతలో నేను దిగిపోవలసిన స్టేషన్ వచ్చింది ఆ పుస్తకం సంగతే ఆలోచిస్తూ దిగాను. నా వెంటనే, నేను దిగిన పెట్టెలో నుంచే 20 సంవత్సరాల యువతి దిగింది. "ఈమె ఇందాకటినుంచీ ఈ పెట్టెలోనే ఉందా!" అని నేను ప్రశ్నించు కున్నాను. ఆమె గబగబా నాదగ్గరకు వచ్చింది.

"ఆ పుస్తకం కొనుక్కోరూ?"

"ఏ పుస్తకం?"

"రైలు పెట్టెలో అమ్మిన పుస్తకం."

"నా కెందుకు?"

"చాటుగా చదువుకొని ఆనందించటానికి. ఇందాక వాడు చదికేటప్పుడు, అందరూ పరిహాసంగా నన్ను చూచి నవ్వేటప్పుడు, మీరు నోరు తెరుచుకొని ఆనందించారుగా!" అంది. వాడు వర్ణించిన స్త్రీ వేషం ఈమెకు సరిగ్గా అతికి పోయిందని అప్పుడు నేను గ్రహించాను. రైల్లో జనం అంతగా ఎందుకు సంతోషించారో అప్పుడు నాకు అర్థమయింది. పాపం, ఈ అమ్మాయి...

"అభిమానం లేకపోతేసరి, ఒక స్త్రీని పట్టుకొని అందులో భారతస్త్రీని, ఈవిధంగా ఇంతమంది పురుషులు పరిహాసిస్తుంటే, నోరు తెరుచుకొని సంతోషించారు."

"నేనేం చెయ్యను? నన్నుమాత్రం వాడు పరిహాసించలేదా? మొదటి అధ్యాయమంతా నాజాతిని గురించేగదా! నేను ప్లీడర్ని."

"ఓహో, మీరు ప్లీడర్లా!! ...అందుకనే మిమ్మల్ని పరిహాసించినా, మీదేశంలోని ఒక అబలను పరిహాసించినా, గుటకలు మింగుతూ సంతోషించారు. ఏ తృణమో కణమో, వంకాయో సొరకాయో, ముట్టజెపితే నాతరఫున వాగేవారు కాబోలు! ...ప్లీడర్లు!" అనుకుంటూ పోయింది.

నాకు ఆశ్చర్యం వేసింది. పరిహాసించటం తప్పయితే ఎవర్ని పరిహాసించినా తప్పే. 'పురుషుణ్ణి ఏమిచేసినా పరవాలేదుగాని స్త్రీని జాగ్రత్తగా వాడాలి, అనే వాదం

నేను ఒప్పుకోను.

"అందులో నీ దేశం, అబలను." ఈ జాతీయవాదం నన్ను ఎప్పుడూ ఆకర్షించలేదు. నన్ను ఒక్కటే ప్రశ్న బాధిస్తోంది. "స్త్రీదర్జంటే ఇంత ఏవగింపు ఎందుకు? దేశం నన్ను దబాయించే బదులు స్త్రీదర్జని లోకువా ణ్ణి ఎందుకు దబాయించదు?"

# నా ఆరాధ్య దైవం

అనుకోకుండా అకస్మాత్తుగా నాగావేళ సాహిత్యంలో
కలుసుకున్నాం. ఎన్నినాళ్ళ నా నోముల పంటగా ఆనాడు
ఆవిష్కంగా ఫలించింది. దినదినమూ స్వప్న వీథుల్లో నాతో
సంచారము చేసే ఆదేశాల పురుషుడు, నిత్య జీవితంలో
ఎప్పుడూ నా తలంపులు వీడిపోని నా ఆరాధ్య దైవం, ఆరోజున
నాకు ప్రసన్నుడయ్యాడు. వారిని దర్శనం చేసుకోవాలనికి
ఎన్ని కలలు కన్నానో, ఎంత తాపత్రయ పడ్డానో, ఆ
ముక్కోటి దేవతల్ని ఎంతగా ప్రార్థించానో నాకే తెలుసు.
వారికి నా బియ్యే పరీక్షను కూడా బలిచ్చాను. నిజంగా
వారి పుస్తకాలు చదువుతుంటే బి. ఏ. పరీక్షకు పోను
న్నా నాకు ఇష్టం అనిపించలా. కగ్గా ళ్ళందరూ
సూర్యాడీ మిఠాయి కొట్టు దగ్గర — గుంటూరు విద్యా
ర్థులకే యీ సంగతి . పది పదిన్నరకు టీ పుచ్చుకొని
Midnight oil తెగ కాలుస్తూ తెల్లవార్లు పరీక్షలకు
Milton అనుకరిత్వంగా ఉప్పొంగిపోతుంటే నేను మాత్రం
తోటి విద్యార్థుల్ని, యూనివర్సిటీ పరీక్షల్ని, ప్రపంచాన్నే
మరచిపోయి వారి కావ్య లోకంలో విహారం చేశానంటే,
వారి మీద నాకు ఉన్న గౌరవం ఎంతో ఎవరూ చెప్ప
లేరు. బాగా టీ పోసుకు వచ్చి తొమ్మిదింటికే సగవసి
నిద్రపోయే రూమ్మేట్లు గుర్రులుకూడా నన్ను భగ్నపరచ
లేకపోయేవి. పత్రికల్లో పడ్డ వారి బొమ్మల్ని ఎన్నిసార్లు
చించి దాచుకోలేదు? వారి అడ్రసుకోరకు, జీవిత చరిత్ర

కోరకు, ఎంత మంది పత్రికా సంపాదకులకు ప్రాధేయ పడుతో ఉత్తరాలు రాయలేదు? ఎంత డబ్బు కష్టాల్లో వున్నా కాలేజీకి కట్టబోయే డబ్బుపెట్టి వారి పుస్తకాలు కొన్లేదు? వారి కథల ద్వారా, కావ్యాల ద్వారా లోకాని కందించిన సందేశాల్ని అనుసరించాను గాని వార్ని దర్శనం చేసుకోలేక పోయానేమో అన్న దిగులు నన్ను ఎంతగానో బాధించక పోలా. పెళ్ళీ పెటాకులు ఏమీ లేకుండా, సంసార మనే రొంపిలో దిక్కుండా, ఎప్పుడూ దేవతాస్త్రీలాంటి పదిమంది స్నేహితురాండ్ర మధ్య కూర్చొని, కవిత్వ మీమాంస జరుపుతో, భావావేశము పొంగి పొర్లినప్పుడల్లా ఒక స్నేహితురాలి తొడల మీద తలపెట్టి మరో స్నేహితురాలి కురులు సవరిస్తో, కవిత్వం చెపుతోంటే, ప్రక్కన యింకో స్నేహితురాలు కలం పట్టుకొని వారి హృదయం నుంచి వెడలే పవిత్ర కవిత్వాన్ని రాస్తోంటే, చూసే మహాభాగ్యం నాకు లేదుగామన్న యీజన్మకు అనుకున్నా. నిజంగా స్వర్గాన్ని భూమిమీద నిర్మించిన ఆ మహనీయుణ్ణి దర్శించి నప్పుడే గాని నా జన్మ తరించ దనిపించింది. నా జీవిత శేషంలో ఎప్పుడైనా వారిని కలుసుకునే మహాభాగ్యమే నాకు లభిస్తే వారిని ఘట్టిగా కావలించుకొని, నేనువారిని ఎంతగా ప్రేమిస్తున్నానో తెలీజేసి, యింటికి తీసుకు పోయి, నేనుకొన్న వారి కావ్యాలు, చదివిన కథలూ, వ్యాసాలూ, పత్రికల్లో చించిన వారి బొమ్మలూ, ముందు పడేసి, వారియందు నాకున్న గౌరవాన్ని వెల్లడిస్తే, నేను చేసిన పనికి వారు సంతోషాన్ని

వెలిబుచ్చితే ఎంత బావుంటుంది, అని అనుకోని రోజు లేదు. ఇంకా ఏమేమి కావ్యాలు లోకానికి ప్రసాదించబోతున్నారో అడిగి నిజంగా వారి కావ్యాలకు నేను సరియైన వ్యాఖ్యానం చెపితే, ఎంతగా ఆనందిస్తారో అనుకున్నా. వారితోనే పరిచయం ఏర్పడితే లోకం అంతా నన్ను చూసి యీర్ష్యస్తుంది గామన్ను, అని గర్వపడేవాణ్ణి.

అంతటి మహాకవిని కలవని తలంపుగా పార్కులో కలుసుకున్నా. స్నేహితులు నలుగురితో వారినిగురించి అమితంగా పొగుడుతుంటే, "మీ పొగడ్తకు గురియైన ఆ కవిని నేనే" అంటూ పిడుగులాగా వచ్చివడ్డ ఆయన్ని చూచేసరికి నాకెంతో అసంతృప్తి కలిగింది. ఆ చిరిగిన కోటు, ఆ అసహ్యంవేసే పిలక, పైకెగ్గట్టిన పంచ, నలభై యేళ్ళకు మించిన వయస్సు, వారికుంటయ్యా? ఎన్ని పత్రికల్లో పడ్డ వారి బొమ్మలు చూచినా, 25 యేళ్ళకు లోపుగా కనబడతాడే. అసలు వారిది క్రాపుతలైతే యీ వెధవ పిలకజుట్టుందా వారికి? సర్వం అబద్ధం. ఇతనెవరో ఆయన్ని బాగా ఎరిగి వుండొచ్చు. వారిదేవూరో, వారు నిత్యం ఏంచేస్తుంటారో, ఎవరన్నా వెడితే దర్శనమిస్తానికి తీరిక వుంటుందేమో, అన్న విషయాలు సావకాశంగా తెలుసుకుంటానికి వీలు చిక్కింది కదా అని ఆయనమీద వచ్చిన కోపాన్నంతా తమాయించుకొని, "అయితే వారు మీకు బాగా తెలుసన్నమాట. ఏవూరండీ వారిది?" అన్నా, ఆతురత కొందికి. ఎగాదిగా నా మొఖం చూసి, "ఆ, బాగా ఎరుగుదును. వారి సంగతి వారికంటె నాకే బాగా

కల్లో ప్రకటన చేశానే 'నటరాజు' అన్న కావ్యం వస్తోం దని, దాని ప్రాతప్రతి మీకు చూపిస్తా," అన్నాడు. కోటు తీసి చిలకకు తగిలించి, పిలక జాడించి ముడేసి ఆయన దారిని ఆయన కమ్మగా నిద్రపోయాడు. కాని ఎంత ప్రయత్నం చేసినా, నాకు నిద్రపట్టలా. ఈ కాకినాడ యాన, యీవొంగొంగి నడక, నడకలోని యీ ఫ్రూపు, వారికుంటయ్యని నేను కల్లో అనుకున్నా, వారి నావిధంగా పూజించుకొనక్కర్లేదని కాను. ఈమాట వారిపోక డను, తత్వాన్నిగూడా అనుసరించే ఆయన అయితే కావచ్చు కాని వారుమాత్రం కాదు. వారి పేరులో తప్ప, వారి ప్రాతల్లోగాని, వారి భావాల్లోగాని, వారి పుస్తక రూపంలో గాని, ఎక్కడా ముసలితనం కన పడదే, మరి ఈయన్లో ముసలివాసన బాగా కొడుతూంటే ఎట్లా సమాధాన పడేది? ఏమన్నాగాని కాకినాడ వెళ్ళి రావలసిందే.

మరునటి రోజు ప్రొద్దుటి పూట ప్యాసింజరుకు ఆయన వెంబటి నేనూ ప్రయాణం కట్టాను కాకినాడకు. అంపకా లయిన తర్వాత అత్త వారింటికి పోయే పెళ్ళికూతురి మాది రిగా దిగులు దిగులుగా, వుత్సాహంగా, బయలు దేరింది రైలు. వధువును సాగనంపే బంధు జనము, మిత్ర బృందము చూచేట్టు మౌనంగా పోయే రైలుబండివంక చూస్తు న్నారు స్టేషను మాస్టర్లు, టిక్కెట్టు కలక్టర్లు, బండి దిగిన వాళ్ళు అంతా ప్లాటు ఫారం మీద నిలబడి తప్పనిసరిగా **పోయితీరాలిసిందే అనుకొని మనోవేగాన్ని పెంచే**

వధువు మాదిరిగానే రైలుకూడా శరవేగంతో పోతోంది. చేలు, చెట్లు, పుట్టలు, పిట్టలు, టెలిగ్రాం స్తంభాలూ అన్నీ కూడా క్షణ మాత్రపు దర్శన మిచ్చి, తిరిగి కనపడ దలుచుకో లేదన్నట్టుగా పోతోన్నాయి వెనక్కు, వెనక్కు. పైరచేలనుంచి ఘుమాయించి కొడుతోంది పచ్చటిగాలి. ఉత్త పచ్చివాసన. ఆయన పేపరు చదువుకొంటో వుంటే, నేను మాత్రం నా దురదృష్టాన్ని తలుచుకొంటూ పెట్టెలో ఎక్కిన ప్రయాణీకుల్ని పరికిస్తూ కూర్చున్నా. కాని సృష్టి కుక్షిలో యిముడ్చుకొన్న రహస్యాన్నంతా మా పెట్టె వెల్లడి చేస్తోంది అన్నట్టుగా స్త్రీలు, సోషలిస్టులు, కోటీశ్వ రులు, బికారులు, విద్యార్థులు, వ్యాపారులు, నటులు, రాజ కీయ వేత్తలు, కవులు, గ్రామఫోను రికార్డిష్టులు, గుడ్డివాళ్ళు, వెధవ్వాళ్ళు అంతా వున్నారు అందుట్లో. పెట్టె ఆ చివర నుంచీ సీతారావణ సంవాదం పాడుకొంటూ వస్తోన్నాడు ఓగుడ్డివాడు, కూతురుముందు దారి తీస్తుంటే. సీత కాపరా నికి వచ్చిన తిప్పలు తలుచుకొని వయన వయనాలు పెడుతో కంట నీరెడుతోంది, ఓ బ్రాహ్మణ వితంతువు. ప్రక్కనే-నోట్లో చుట్టపెట్టుకొని సొంగ కారుస్తూ ఓపల్లె టూరి యువకుడు బండబూతులు తిడుతోన్నాడు రావణాసుర అధముణ్ణి. అప్పుడే నా ప్రక్కనున్న ఓసనాతను నుడు చేతిలోని పంచాంగం బాక్కీ-శామీాద పెట్టి అక్షరక్షరానికి రాగాలు తీస్తో శాపాలు పెడుతున్నాడు ముద్దుకృష్ణను. విని విని సహించ లేక అందుకున్నాడు ఓ కాలేజీ స్టూడెంటు. నెమ్మది నెమ్మదిగా యిరువక్షాలకు

వాగ్యుద్ధం ప్రారంభమయింది. యుద్ధం మధ్యలో, ఎప్పుడో ఎవ్వరికీ తెలీకండానే, పక్క స్టేషన్‌లో జారుకున్నాడు గుడ్డివాడు, శూన్యహస్తాల్తో.

పవరుపేట స్టేషన్‌లో గామున్న ఆ పుస్తకాలమ్మే వాడు మా పెట్టె ఎక్కింది. పదిమందికి పది పుస్తకాలందిచ్చి, తనో పాట ఎత్తుకున్నాడు. నాకు నిజంగా రైల్లో అమ్మే పుస్తకాలంటేనే పరమ అసహ్యం. ఆ పుస్తకాలు కొనేది చాక రకపు రుచులు గలవాళ్ళు, ఆడవాళ్ళు తప్పితే యింకొకరు కొనరని నా నమ్మకం. అట్లాంటి పుస్తకాలు రాసేవాళ్ళని కొనేవాళ్ళని చూస్తే, బీదవాళ్ళని, జీతగాళ్ళని, చూచి అసహ్యించుకొనే వుద్యోగస్తుని భావమరిదికిమల్లే చాలా చులకన నాకు. ఆ పుస్తకాలమ్మే వాణ్ణి దగ్గరకు పిలిచి, "పతివ్రతల కథలు, వున్నయ్యా?" అన్నాడు ఆయన. ఆయన ఆపుస్తకం కొనేసరికి నా హృదయం పచ్చిగాయం అయింది. అంతటి కళోపాసకుడు, అంతటి ప్రతిభావంతుడు, రసపిపాసి, పతివ్రతలకథలు కొనేసరికి ఖూనీ చేసినట్లయింది నాకు. ఈయనకు పతివ్రతల కథలు దేనికబ్బా! సంసారమా, మన్నా! వొంటిరిగాడయ్యె. ఏమో, పెళ్ళిచేసుకు వుండగూడదసూ. లోకానికి తన కావ్యాల ద్వారా పెండ్లిలో సుఖం లేదు, పెండ్లి అంటే నరకం అని ప్రబోధించే ఆయన పెండ్లి చేసుకుంటాడా? అసలు నేను ఆరాధించే దైవము, నేను గణించే ఉత్తమ కావ్యాలు రచించిన పవిత్ర లేఖిని, ఈయన్లో లేదేమో అని పోతోంది మనస్సు. కాదు, నీ ఆరాధ్య దైవం

యీాయనే. ఈయన్ని గురించి ఆలోచించటంలో మొదటినుంచీ తప్పుపడ్డావు, అని బోధిస్తోంది అంత రాత్మ. అంతరాత్మకు మనస్సును తిరుగుబాటు చేసే శక్తి లేక కిక్కురు మనకుండా వూరుకుంది పిరికిపంద!

సాయంత్రానికి కాకినాడ చేరాం. యింట్లో కాలు పెట్ట గానే నాకు పరిస్థితులు అర్థమయ్యాయి. ఆచిన్నకొంప, ఆపరిసరము, మురికి కాలవలు, యీాయనకు యింతటి మహోదాత్తకవిత్వం రాస్తానికి వుద్దేశాన్ని ఎట్లా కల్పించాయా అనిపించింది.

"పెండ్లి చేసుకోలేదంటివే"—మనస్సును దబాయిస్తోంది అంతరాత్మ. ఆయన సంసార రొంపి అంతా చూచి వెనక్కు పదమని బాధిస్తోంది నాలోని కిశోహృదయం. ఆరాత్రి మాయిద్దరకు ఆమె—ఆయన భార్యా— వడ్డించింది భోజనం. ఆరాత్రల్లా చాలా బాధ పడ్డాను. ఎప్పుడు తెల్లవారుతుందా ఎప్పుడు పోయి తెనాల్లో పడదామా అనిపించింది. తను పెళ్ళి చేసుకొని పెళ్ళాంతో సరసాలు, చదరంగాలు, ఆడుతూ సౌఖ్యం అనుభవిస్తూ, లోకానికి పెండ్లిలో నరకం వుంది, పెండ్లి చేసుకోవద్దని బోధించి, బెదరగొట్టి, నాలాంటివాళ్ళను సర్వ నాశనం చెయ్యటమేనా యీాయన కావ్యాదర్శం. విశ్వశ్రేయస్సు అంటాడే మరి. ఏమిటా విశ్వశ్రేయస్సు. ఆయన్ని గురించిన నా ఆదర్శాలన్నీ ఏమయిపోవాలి? యిట్లా నలిగి నాశనం కావలసిందేనా. ఆదర్శాలు చంపుకొన్న యిట్లాంటి భ్రష్టుడని తెలిస్తే వాడిపుస్తకాలు కాదు వాడి పేరన్నా

తలచే వాణ్ణి గానే.

తెల్లవారి నేను లేవకముందే ఆయన లేచి కాలకృత్యాలు తీర్చుకొని కోటు తగిలించు కుంటున్నాడు. నేను నిద్ర లేవటం చూచి భార్యను పిలిచి ఆమెను ఎదట పెట్టుకొని "ఏమండీ ఆఫీసుకు టైము అయింది. తిరిగి పదకొండింటికి వస్తాను. మీరు కాఫీ అదీ తీసుకొని పుస్తకాలు చదువు కొంటూ వుండండి. యిదిగో నటరాజు. కాకపోతే మీరు చదరంగం చాతనైతే శ్యామతో ఆడుకోండి," అంటూ భార్య వంక చూశాడు. ఆమె నవ్వుతూ లోపలకు పోయింది. ఆయన బైటకు దాటాడు. "ఆఫీసు" ఏమిటీమాట. కావ్య లోకంలో విహారం చేస్తూ, ఊహా సమాధిలో వుండే కవి కుమారుని నోట్లోనుంచీ "ఆఫీసు, Cut, heavy work, రైలుచార్జీలు, పాలడబ్బాలఖర్చు" యీతాలూకా గుమాస్తా మాటలు వస్తయ్యా. యీయన వుద్యోగస్తుడా? కవిగాదూ! రెండూనా! అసంభవము! ఏదో తేల్చుకోవాలి.

నేను కాఫీ తీసుకొంటుంటే ఒక్క నిమిషం పక్కన నిలబడి "ఏవూరండిమీది" అన్నది ఆవిడ. ఆమె ధైర్యానికి, నాపిరికితనానికి నొచ్చుకొంటూ "తెనాలి. వారిని చూడాలని చాలా కాలంనుంచీ అభిలాష" అన్నా.

"అవును. మీబోటివాళ్ళు చాలామంది వచ్చిపోతుంటారు యిట్లాగే. వారిపుస్తకాలు చదివి ఉన్మత్తులై వారిని చూడాలనీ, వారితో మాట్లాడాలనీ, చాలామంది విద్యార్థులు, యువతులు వస్తూంటారు. మాకు వున్న భాగ్యమల్లా అదే. అయితే మీరుగూడా కవిత్వం

రాస్తారా?" అన్నది. ఆమాటలూ, ఆభావగర్భితమైన చూపులూ, ఆవు్రదేకమూ, అన్నీ కవి లక్షణాలుగాని స్త్రీలక్షణాలుగా లేనే. నిజంగా ఆకావ్యాలు రాస్తోంది ఆయనా లేకపోతే యీామె చాత రాయించి తనపేరు పెట్టు కుంటున్నాడా అనిపించింది "మీాకు పెండ్లి అయిందా" అని అడిగింది తిరిగి. కాలేదన్నట్లు తలూపాను. కాఫీకప్పు చేతో్పట్టుకొని "నిజంగా కవి గావటం జన్మ నక్షత్రం. అందులో యింతటి మేధాసంపన్నులు ఉద్భ వించటం ఆంధ్రదేశం నోచుకున్నమహాభాగ్యమే" అన్నా. ఆడావిడతో ఆమాత్రం ధైర్యంగా మాట్లాడకపోతే నాలోని పురుషత్వానికి ఎక్కడ నామోషీ కలుగుతుందో అన్నట్లు ఫీలయి.

"అవునవును. యిదివరకు వచ్చినవారూ యిట్లాగే అన్నారు" అంది నవ్వుతూ. నిజంగా కవిత్వం ఆయన కావ్యాల్లో లేదు. యీామెలోనే వుంది. ఆయనకు కాక పోయినా ఆయన కావ్యాలకు సరియైన భార్యా దొరికింది అనిపించింది. ఆమెనుగురించి నాలో కలుగుతోన్న అభి ప్రాయాన్ని, అభిమానాన్ని, ఆచుకోలేక "నిజంగా వాటికి తగినవారు దొరికారు. మిమ్మల్ని చూస్తూ వుంటేనే ఎన్నెన్ని కావ్యాలయినా రాస్తూవుండొచ్చు. వారి కావ్యా లన్నీ మీాలో ఆవిర్భూతమై వున్నాయి. కాని నిజంగా మీాలాంటి ఉత్తమయిల్లాలిని పొంది పెండ్లిలో సుఖంలేదని వారు ఎందుకు ప్రచారం చేస్తున్నారో నాకు తెలీటంలా" అన్నా, ఎంతగానో నన్ను చూచి ఆనందిస్తుం దనుకొంటూ.

ఈమాటలు వినేసరికి ఆమెకు మండుకొచ్చింది. ఆకలిగొన్న ఆడపులి మాదిరిగా ఒక్కసారి విజృంభించింది. "ఈలాంటి మూర్ఖనమ్మకాన్ని నాకు కలిగించే యిదివరకు వారందరూ మోసగించి పోయారు. మొదట్లో నేనుపొరపాటు పడ్డాను లేకపోతే యింతదాకా వచ్చి వుండకపోను. చూడండి. యిట్లాగే రోజూ ఎంతోమంది వచ్చిపోతూ వుంటారు. వారుగూడా వచ్చినవాళ్ళను ఆదరించటమే కాకుండా లేనిపోని స్నేహాలు చేసి రోజుకు పదిమందినన్నా యింటికి తీసుకొస్తుంటారు. ప్రతికుర్రవెధవతోగూడా నీకు నా భార్యాచేత కాఫీ యిప్పిస్తాను. ఆమెతో నీవు చదరంగం ఆడగలవా" అంటూ కూర్చుంటారు. ఈ వచ్చిన వారిని సత్కరించ లేక, వారితో చదరంగం ఆడలేక, నాకు చావు దగ్గరకు వస్తోంది. మీరు దయ దలచి ఆకాస్త ప్రయాస తగ్గించారు యింకా. నిజంగా మాట్లాడితే వారికి ఎందుకు చెప్పండి యీ బెడద అంతా. సుఖంగా, Press లో యిచ్చే నలభై రూపాయల్తో కాపురం ఎట్లాగొట్లా జరుపుకోక యీ కవిత్వం రాయటం, పుస్తకాలు అచ్చువేయించి డబ్బు తగలెయ్యటం, డబ్బులేక బాధపట్టం, అంతా ఎందుకొచ్చిన పని చెప్పండి. నేను కాపరానికి వచ్చేసరికే వారికి యిద్దరు సంతానం. పాపం మొదటిభార్యాను ఎన్నికష్టాల పాలుచేశారో తెలీదు గాని, నేనువచ్చిందగ్గరనుంచీ మాత్రం Press వాళ్ళు యిచ్చే నలభై రూపాయలు తెచ్చి నా చేతిలోనే పెడతారు. ఏదో ఒక విధంగా కాపరం పొదుపుగా వాడుకొని కాస్తో కూస్తో మిగులుస్తాం. ఇట్లా

ఓ ఆరునెల్లు జరిగిం తరువాత ఎప్పుడో ఒకప్పుడు అకస్మా
త్తుగా వారికి పిచ్చెత్తటం, రెండు రోజులు నిద్రాహారాలు
లేకండా కూర్చొని పేజీలు పేజీలు నింపటం, నెమ్మదిగా
నన్ను బ్రతిమాలి అచ్చుకు అయిన ఖర్చుకు నాలుగురెట్లు
తెచ్చి నీచేతిలో పోస్తానని బూటకాలు చెప్పి ఆనిలవడబ్బు
కాస్తా పుస్తకాలకు పాడు చెయ్యటం మామూలు. అచ్చు
వేయించిన పుస్తకాలు కంటబడ్డ ప్రతి వానికీ, తగలేస్తుం
టారు. కాని ఖర్చుబోతేనా. చూడండి, యింట్లో బీరువాల
నిండా ఎన్ని పుస్తకాలు మూలుగుతూ ఉన్నయో.
ఆ Manager వుద్యోగం కాస్తా Press వాళ్లు వదిలిస్తే
సంసారం ఏంగాను చెప్పండి. అదేమన్నా గవర్నమెంటు
వుద్యోగమా, పెన్షన్ పుచ్చుకోటానికి. వారికి 50 ఏళ్లు
నిండుతున్నయి. పగలల్లా Pressలో అవస్తపడి వచ్చి
రాత్రికింత తృప్తిగా భోంచేసి "కృష్ణా, రామా" అనుకోవల
సిన రోజుల్లో, వీరికి కవిత్వం, స్నేహితులు, సినిమాలు, చద
రంగాలు, ఎందుకు చెప్పండి. మీకు కష్టంగా వుంటే నే
నేమీ చెప్పలేను గాని, వారిని లోకం, యీవిథంగా బాధిం
చటం దేనికి చెప్పండి. మీకవిత్వం చదివాను, చాలా బా
వుంది. నిజంగా మీలాంటి మహాకవులు వుంటం మాభా
గ్యమే అంటూ యింత పొడుగున వారిని పొగుడుతూ
రాసి, చివర మీపుస్తకాలు ఫలానీవి నేను చదవలేదు
దయవుంచి పంపగోరుతాను; అని ప్రతివాడూ వ్రాయటం
దాంతో వారు వుబ్బి తబ్బిబ్బయి పుస్తకాలు పంపడమూ.
అచ్చు ఖర్చులుగాక పైగా యీపోస్టు ఖర్చులకు నలిగి

పోతూంది సంసారమంతా. ప్రతివాళ్లూ వచ్చేదీ, రెండు మూడు రోజులు పీఠం వేసేదీ, ఆహాహా మీకవిత్వానికి సాటి వుందా, మీకలానికిఎదురువుందా, అని పొగిడిపోయేవారూ, వారితో పక్కనకూర్చుని నాచాత కాఫీ యిప్పించుకొని నాతో చదరంగం ఆడి, నన్ను పొగిడి, వారి సోషియాలజీకి మెచ్చుకొనిపోయే కుర్రకుంకలు తప్పితే, వారికి వచ్చేదెంతో, సంసారంఖర్చు ఎంతో, అడిగి కష్టనిష్ఠూరాలు తెలుసుకుంటానికి ప్రయత్నించేవాడు వుంటేనా. ఇట్లా ఎంతకాలం సహించటం చెప్పండి ఓర్పుకయినా, మితంవుండొద్దూ. చదరంగం ఆడిఆడి, మధ్యమధ్య కుర్రవెధవలు పావులు పట్టుకొనే నెపంమీద చెయ్యిపట్టుకొని, గిచ్చినగంట్లు చూడండి ఎన్నో" అంటూ గబగబాదగ్గరకువచ్చి సంకోచము లేకుండా చేతిని నాకందిచ్చింది. సున్నితమయిన ఆచేతినిండా గంట్లు కనబడుతూనే వున్నాయి.

"చూడండి. స్నేహితుల పక్కన నన్ను కూడా కూర్చోబెట్టి ఆటలాడించి వారిమట్టుకు వారు తృప్తిపట్టం నేర్చుకున్నారు గాని, నా హృదయం ఎంత గాయమవుతుందో ఆలోచించనన్నా ఆలోచించరు. ఆ వచ్చే కుర్రవెధవలుగూడా ఆయన భార్యను తమ ప్రక్కన కూర్చోబెడుతున్నాడే అన్న వెర్రిసంతోషమే గాని అట్లా చేసేది వాళ్ళకొరకు గాదు, ఆయన తృప్తి కొరకేనని గ్రహించలేరు. మరివారేమో........"

కాఫీకప్పు ప్లేటు పట్టుకు లోపలకు పోయింది. ఆమెను చూచి సంతోషము, జాలి, అన్నీ కలిగాయి ఒక్క

సారిగా. నిండుచూలాలు, కమ్మని విగ్రహం, మాంచి సౌందర్యం కూడాను. నిజంగా యిటువంటిఆమెనే పెళ్ళి చేసుకు తీరాలి. పెళ్ళి అనేసరికి శరీరం కంపించిపోయింది. జీవిత మంతా అగాధంగా కనుపించింది. ఇన్నిరోజుల నా ఆరాధ్య దైవం యీ ముష్టివెధవేనా, అని దుఃఖం పొంగి వచ్చింది. అప్పుడు వెనక్కు తిరిగాను. ఈ ముష్టివెధవ మాటలు నమ్మి ఎంతజీవితాన్ని వృధా చేసుకొన్నాను. నా జీవిత నాటకంలోని అంకాలు వెనక్కు తిప్పా అప్పుడు. అంతా శూన్యం, అగాధం, అంధకారం!

# రా యి ట్సు.

కుటుంబ పరిస్థితులు దుర్భరంగా ఉన్నాయి. అసలే స్థిరాస్తి తక్కువ. అది కూడా తన చదువుకు ఖర్చు పెట్టాడు. తండ్రి ముసలివాడైనాడు. ఇప్పుడు జీవితాన్ని నూతనంగా ఆరంభించి సంపాదించలేడు. కుటుంబాన్ని పోషించవలసిన బాధ్యత తనమీద ఉంది.

ఇవన్నీ గోపీకి తెలుసు. అందుకనే బి యల్ ప్యాసయి ప్రాక్టీసు పెట్టాడు. తన విప్లవహృదయాన్ని కోర్టువైపుకి తిప్పటానికి ప్రయత్నించాడు. కాని ఆ జీవితం అతనికి సరిపడలేదు. అతనికి చిన్నప్పటినుంచీ, ప్రపంచంలో ఏదో ఘనకార్యం చెయ్యటానికి తాను జన్మించానని నమ్మకం. "తాను చచ్చిపోతే— గోపీచచ్చిపోతే— ప్రపంచానికి ఎంతలోటు!" ఎంత జ్ఞానం సంపాదించినా ఈ నమ్మకం పోవటం లేదు.

"నీవు ఏదైనా ఉద్యోగం చూచుకోవాలి" అన్నాడు తండ్రి.

గోపీ తలవంచుకునే "అంతకన్నా చెయ్యవలసిన పనులు ఈ ప్రపంచంలో చాలాఉన్నాయి," అన్నాడు.

తండ్రికి కోపం వచ్చింది: "నేనూం ఇలాగే అనుకొని నిన్ను పోషించకపోతే, నీకు చదువు చెప్పించకపోతే ఏమయ్యేవాడివి? కుటుంబాన్ని పోషించలేని వెధవలు ప్రపంచంలో ఏంచేస్తారు ? సోషలిజమా?" అని కేకలు వేశాడు.

గోపీమాట్లాడలేదు. నెమ్మదిగా లేచాడు. తల్లి వంట ఇంట్లోనుంచి తొంగి చూచి "ఎక్కడికిరా, నాయనా" అని అడిగింది.

"ఇక్కడికే. ఇప్పుడే వస్తాను," అని చెప్పి బయటికి వచ్చాడు.

గోపీకి తండ్రిమీదకోపంలేదు. ఆయనహృదయాన్ని అతడు బాగా అర్థం చేసుకున్నాడు. ఆయన కోరికలో తప్పేముంది? కొడుక్కి చదువుచెప్పించాడు. వృద్ధాప్యంలో కుటుంబ భారం అతడు వహించాలని కోరుతున్నాడు. ఇందులో తప్పేముంది?

గోపీకి తాను బి.ఏ చదువుకునేనాటి రోజులు జ్ఞప్తికి వచ్చాయి. తనతండ్రి తనమీద ఎంత ఆశ పెట్టుకున్నాడు! తాను బి. యల్. ప్యాసయినప్పుడు "ఇప్పుడు ఎంత హాయిగా ఉంది. హృదయంమీద బరువు దిగజారిపోయి నట్టుగా ఉంది," అని ఎంత సంతోషించాడు!—అందుకు గాను తాను ఏమి చేస్తున్నాడు? చదువు పూర్తి చేసుకొని ప్రాక్టీసు మానివేశాడు.

ఆహా! ఆరోజుకీ ఈరోజుకీ ఎంత మార్పు!! తన్ను గౌరవించే కుటుంబానికి హఠాత్తుగా పనికిరాకుండా పోయాడు. ఇదివరకు దూరంగా ఉండి నమస్కారం చేసి తొలిగిపోయేవారు, ఇప్పుడు భుజంతట్టి వెకిలినవ్వులు నవ్వుతున్నారు. మొన్న ఒకడు "నీకూ నాకూ భేదం ఏముంది?" అని అడిగాడు అతనికీ గోపీకీ ప్రాక్టీసు చెయ్యటంలో నేనా భేదం !!!

ఉదర పోషణార్థం ప్రాక్టీసు పెడితే గొప్పనూ, సంఘం శ్రేయస్సు కోసం ప్రాక్టీసు మానేస్తే తప్పానా? తను ప్రాక్టీసు పెట్టి డబ్బు సంపాదిస్తే వీరి కేమి వస్తుంది?

ఎండ తీక్షణంగా ఉంది; చిటచిట లాడుతున్నది. ప్రజలు ఎవ్వరి పనిమీద వారు తిరుగు తున్నారు. ఏమిటి, వీరందరూ చేసేపని? వీరందరూ తమ విద్యుక్త ధర్మాన్ని నెరవేర్చు కుంటూ ఉంటే ప్రపంచం యీ స్థితిలో ఎందుకు ఉంది?...

ఎవ్వరో పిలిచారు:

"గోపీ?" కిష్టార్రావు.

గోపీ ప్రాక్టీసుచేసే రోజుల్లో కిష్టార్రావు అతని క్లయింటు.

"ఇవ్వాళ కోర్టుకి వెళ్ళలేదా?" అని అడిగాడు.

కిష్టార్రావుకి గోపీ ప్రాక్టీసు మానివేశాడని తెలుసు. ఎందుకు వెళ్ళలేదో అతనినోటి మీదగా చెప్పించి, ప్రాక్టీసు చెయ్యటంమీద, డబ్బు సంపాదించటంమీద, చిన్న ఉపన్యాస మివ్వాలని కుతూహలం!

"సబ్ కోర్టు ఎత్తి వేస్తారటగా? మున్సబు కోర్టు కూడానో?"

గోపీ వినిపించుకో లేదు. ముందుకు సాగిపోయాడు.

ఏమి ప్రపంచం!

గోపీకి సరళ జ్ఞాపకం వచ్చింది. తనలో తాను నవ్వు కొన్నాడు. అది గోపీ జైల్లో ఉన్నప్పటికథ—

వార్డరు వచ్చి, "మీ బంధువు లెవ్వరో మిమ్మల్ని

చూట్టానికి వచ్చారు" అని చెప్పాడు.

"ఎవ్వరు? నాబంధువులా! నన్ను చూట్టానికొచ్చారా?" మరీ దగ్గరబంధువులను గాని లోపలికి రానివ్వరని అతనికి తెలుసు. తాను జైల్లో పడ్డట్టు తలిదండ్రులకు తెలియదే!

"మీభార్య—"

"భార్యా—నాభార్యా!" బిగ్గరగా నవ్వాడు.

మీ భార్యలను మీరు బైట ఉన్నప్పుడు ఇంత గాఢంగా ప్రేమిస్తే జైల్లోకి వచ్చే ఉండరు. ఎవ్వరి భార్యలను వారు క్షేమించాలని ప్ర...రం చేస్తేగాని ఈ ఉద్యమం ఆగేటట్టు లేదు." అని చెప్పి వార్డరు ఆమెని తీసుకొని వచ్చాడు.

"ఆరోగ్యంగా ఉన్నారా?" అని అడిగింది. ఎంత మాధుర్యం! ఎంత దయ!! ఎంత ప్రేమ!!! భార్య.

"ఉన్నాను." ఆమెను చూశాడు – ఏమా అందం? – ఒకరి నొకరు చూచుకొన్నారు.

"విచారపడుతున్నారా?"

"ఎందుకు విచారం?" గోపీ ఆమెని పరీక్షగా చూచి ఆనవాలు పట్టటానికి ప్రయత్నించాడు.

"మీరు మీసరళను మరచిపోయినట్టున్నారు."

"లేదు. మరచిపోలేదు." నవ్వాడు.

ఆమె నవ్వింది. గోపీని ప్రేమపూర్వకంగా చూచింది. ఒకడుగు ముందుకు వేసింది – వార్డరు దగ్గాడు.

"మీరుగోల చెయ్యకూడదు." అన్నాడు.

ఒకడుగు ముందుకు వెయ్యకూడదా?" అడిగాడుగోపి.

జవాబు లేదు.

"నవ్వగూడదా?" ఆమె అడిగింది.

"బిగ్గరగా నవ్వగూడదు.."

ఆమె గోపీని చూచి, "ఇక్కడ మీరెవ్వరైనా నవ్వుతుంటారా?" అని అడిగింది.

"ఇక్కడ నవ్వబుద్ధీ కాదు; ఏడవ బుద్ధీ కాదు."

"నే నీసారి వచ్చేటప్పుడు మంచిపువ్వులు తెస్తాను."

"నేను వాటిని పూజిస్తాను. అవి నిన్ను జ్ఞాపకం చేస్తుంటాయి," అన్నాడు. ఆమె మందహాసం చేసింది.

"విచార పడకండి. వచ్చే శనివారం మళ్లీ వస్తాను." వారు ఒకరి నొకరు చూచుకున్నారు. పరవశులయ్యారు.

"టైమయింది" అన్నాడు వార్డరు.

"కాలేదు" అన్నాడు గోపీ.

"అధైర్యపడకండి. మీరెక్కడున్నా, ఏపరిస్థితుల్లో ఉన్నా మిమ్మల్ని తలుచుకునే స్నేహితులున్నారని జ్ఞాపకముంచుకోండి." చిరునవ్వు వొలికిస్తు వెళ్లిపోయింది.

గోపీ ఆనందాశ్రువులు రాల్చాడు. సంతోషంతో "ప్రేయసీ, నీ హృదయకుహర వాటి" అని రాగాలాపన చేశాడు.

"ఇక్కడ పాడగూడదు" అన్నాడు వార్డరు.

"ప్రేమించుకో వచ్చా?"

జవాబు లేదు.

"పోనీ ఆలోచించుకోవచ్చా?"

జవాబు లేదు.

గోపీ ఆరోజంతా కలలో ఉన్నట్టుగా ప్రవర్తించాడు. శనివారంకోరకు ఎదురుచూశాడు. శనివారంవచ్చింది. ఆమెరాలేదు. కొన్నిపువ్వులు పంపింది. మళ్లీ ఇంతవరకు కనుపించలేదు. ఆమె పంపిన పువ్వులను భద్రంగా దాచాడు. ఆపువ్వులను జేబులోనుంచి తీసి, కన్నీటితోచూసి పెదవులకు ఆనించుకున్నాడు. —

"గోపీ!"

గోపీ ఉలికిపడ్డాడు. ఎదురుగా వస్తున్న ప్రకాశరావుని చూశాడు. పువ్వు జేబులో పెట్టుకున్నాడు చిన్నప్పుడు ప్రకాశరావు విప్లవకారుడు. దేశనాయకుడై గాంధీటోపీ ధరిస్తాడని ఆలోజల్లో అనుకునేవారు.

"ఎప్పుడొచ్చావు" అని అడిగాడు.

"ఇక్కడే ఉంటున్నాను."

"ప్రాక్టీసు చేస్తున్నావా?"

"ఆ — నీవేంచేస్తున్నావు?"

"గుమాస్తా — 40 రూపాయలు ఇస్తారు — కులాసాగానే జరుగుతోంది."

గోపీ ఇక అతనితో మాట్లాడ లేకపోయాడు. గబా గబా ముందుకునడిచాడు. "గుమాస్తా—40 రూపాయలు—కులాసాగానే జరుగుతోంది." ప్రకాశరావు పిలుస్తాడేమో నని వేగంగా ఇంటికి దారి పట్టాడు.

"అడుగో గోపి."

"సోషలిస్టు" అన్నాడొక గాంధేయుడు.

"రాయిస్టు" అన్నాడొక కాంగ్రెస్ సోషలిస్టు.

"Learned fool" అన్నాడొక idiot.

గోపీ ఈ మాటలు విన్నాడు — వినిపించుకోలేదు. ఘోరం! తాను కుటుంబానికి పనికిరాకుండా పోయాడు. సంఘానికి!... కాని తనకుటుంబం తనకు అర్థ మవుతోంది. ఈసంఘం!—అతని తల తిరిగిపోతోంది. అలాగే ఇంటికి జేరుకున్నాడు.

చీకటి పడింది.

తండ్రి ఇంకా నిద్రపోలేదు. గోపిని చూచి, "అమ్మా, పోవలిస్టు వేంచేశాడు." అని చెప్పాడు. "బాబూ, ఇంతసేపు ఎక్కడున్నావు?— అన్నం వడ్డించనా?"

"వడ్డించు!" అన్నాడు తండ్రి.

గోపీ మాట్లాడలేదు. అన్నం వడ్డించింది. గోపీ కాళ్ళు, చేతులు కడుక్కొని భోజనానికి కూర్చున్నాడు.

"వారిమాటలు లెక్క చేసుకోకు. ముసలితనంలో వారికి కోపం ఎక్కువయింది." అన్నది.

గోపిమాట్లాడలేదు. "నీవు కూడా ఆలోచించు. వారు మాత్రం ఇంకెంతకాలం సంపాదిస్తారు? నీవు ఏదో ఒక ఉద్యోగం చూచుకోకపోతే కుటుంబం ఎలా జరుగుతుంది?" గోపీ మాట్లాడలేదు. "బాబూ, నేనొక్క మాట అడుగు తాను, కోపం రాదుగదా?"

"కోపం ఎందుకు?"

"ప్లీడరుపట్టా తెచ్చుకున్నావుగదా! కోర్టుకి వెళ్ళటం లేదు, ఎందుకని?"

గోపీకి అన్నం సహించలేదు. గబగబా చేతులు

కదుక్కొని పోయి పడుకున్నాడు. "నే నేం చేశాను నే నేం చేశాను !! నే నడిగిం దాంట్లో తప్పే ముంది ? అని తల్లి రోదిస్తోంది. "భగవంతుడా, మే మేమి చేశాము? ఎందుకు మమ్మల్నిలా శిక్షిస్తున్నావు ? మా పిల్లలను మాకర్థమయ్యేటట్లు చెయ్యవా ?" అని తండ్రి తన గదిలో ప్రార్థిస్తున్నాడు.

గోపీకి ఆందోళన ఎక్కువైంది. "వారి తప్పేముంది? నేనింత బాధపడటం, కోపం తెచ్చుకోవడం ఎందుకు?" ఆలోచించాడు. సరళ జ్ఞాపకం వచ్చింది— "మీరు ఎక్కడ వున్నా, ఏ పరిస్థితుల్లో వున్నా మిమ్మల్ని తలచుకొనే స్నేహితు లున్నారు." ప్రకాశరావు జ్ఞాపకం వచ్చాడు ! గుమాస్తా...40 రూపాయలు ... కులాసాగా నేవుంది.— గోపీకి దడ పుట్టింది. ఏమిటిది? నాలో యిద్దరున్నట్టున్నారు ఇందులో ఎవ్వరు నిజం? ఈ బాధ పడే నేనా? ఈ బాధ పడటం తప్పని చెప్పే రెండోవాడా? ఈ ఇద్దర్లో నే నెవరిని? నేను నేను కాదా? అయ్యో! గోపీ ఈ ఆలోచన భరించలేక పోయాడు.........

తెల్లవారి లేచి చూచేటప్పటికి గోపీ ఇంట్లో లేదు. తల్లి గోల పెట్టింది. తండ్రి "సోషలిజం చెయ్యటానికి వెళ్ళాడు. వాడే వస్తాడు." అన్నాడు. కాని గోపీ రాలేదు. తల్లిమాత్రం ఇంకా ఎదురుచూస్తూనే ఉంది. తండ్రి నే నే మన్నాను— నే నేంచేశాను— ఈ ముసలివాళ్ళు బ్రతకటం ఎందుకు—చావటానికేనా?" అని విలపిస్తూనే ఉన్నాడు.

# భావజీవులు !!!

"నన్నా పెండ్లి చేసుకున్నది, నీ ఆఫీసునా?"

"పొరపాటున రెంటినీ కట్టుకున్నా, అదే శోచనీయం."

"మోసం! వట్టి మోసం!"

"నేనేమీ మోసం చెయ్యలేదే!"

"చెయ్యక ఏం చేశావు? నిన్ను పెండ్లాడింది దేనికి? మద్రాసులో 144నం జైల్లో వంటచెయ్యటానికీ, ఈ కారాగార నివాసం అనుభవించటానికీనా? ఈలాంటివాడివి నన్నిక్కడి కెందుకు తీసుకొచ్చావ్? ఈశిక్షను అనుభవించటానికేగా?"

"ఇంతకూ నన్నేం చెయ్యమంటావు?"

"కాదు కవరుమీది అణాబిళ్లలాగా ఆఫీసుకుర్చీకి అతుక్కు పొమ్మంటాను."

"రాణిగారు క్షమించాలి."

"ఈ ఎత్తిపొడుపులుకూడానా! నేను రాణి నైతే యిలా ప్రవర్తించటానికి గుండె లుంటాయా?"

"చాలాదూరం పోతున్నది. నేను చెప్పేదంతా విను. తరవాత నీయిష్టం. ప్రతిజీవి బ్రతకాలి. ప్రాణాలతో వుంటే తరువాత సుఖం. చూడు, మనమిద్దరం యీజన సముద్రంలో అణిగిపోని అలలుగా వుండాలి. అలా ఉన్న తరవాతనే మంద్రస్వరం, తుంపురలు, నురుగులు, బయలు దేరుతాయి. అసలు అలలే లేకపోతే యివన్నీ ఎక్కడ నుంచివస్తాయి? ఇంకా మన జీవిత తరంగం పుంజుకో నేలేదు.

"జీవితానికీ తరంగాలకీ సంబంధమేంటి? వట్టిపైత్యపు మాటలు నాతో చెప్పకు. ప్రొద్దున్నే కాఫీ తాగి పోయిన పోక రాత్రి 7 గంటలకు చేరుకోని నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని మళ్ళా ఆఫీసుకు పోవటానికి ఒప్పుకో మంటావు' నన్ను ఈ జైల్లో పడి పలకరించే దిక్కు లేక చావమంటావు. అబ్బా, ఎంత చక్కటి కవిత్వం చెప్పావు దీనికి?"

"ఏం చెయ్యమంటావు? భుక్తికి గడవ వద్దూ? ముప్పై రూపాయలతో యీపట్నంలో రెండుపొట్టలు ఎలా నిండుతాయి? అందుకే ట్యూషన్ కూడా ఒప్పుకున్నా రాత్రి 7½ నుంచి పదింటిదాకా."

"ఔను, నీసుఖం నీవు చూచుకున్నావు. ఈ అరవ తిండి తినలేక నన్ను తీసుకొచ్చావు. లేకపోతే అంత ప్రేమా నామీద?"

"ప్రేమంటే ఎలావుంటుందో!"

"ప్రేమ లేకపోతే యిలానే వుంటుంది.........."

విశ్వనాధానికి కష్టం వేసింది. అప్రయత్నంగా "ఎందుకొచ్చిన పెళ్ళి! అన్నాడు."

"పెండ్లి అంటే ఏమనుకొన్నావు మరి?"

"ముసలివాళ్ళకు గారంటీ అని, పడుచువాళ్ళకు నరకబాధ అని, అసంతృప్తికి అసంతుష్టికి తావులేని మహోదాత్త హృదయాలకు స్వర్గమనీ అనుకున్నా."

"ఇల్లాంటి సినిక్‌తో కాపరం చెయ్యలేను. ప్రేమంటే తుస్కారించేవాడితో, వివాహసంస్థను గౌరవించలేని వాడితో, నేనుండలేను. ఈ తుచ్ఛ భౌతికాన్నే

నమ్మే వాళ్ళతో ప్రణయపూర్వమైన సాహచర్యం స్నేహం చెయ్యలేదు. సినికల్ మెంటాలిటీకి నాకూ చాలాదూరం”

“మంజూ, ఊరికే తొందరపడి లాభంలేదు. ఆ పెస్సిమిజంలోనే ఆప్టిమిజం ఉంది.”

“లేదు. నీకూ నాకూ చాలాదూరముంది. ఇతవరకు నడిచిన కథంతా వట్టి భ్రాంతి.”

బయటిగదిలో నవ్వులు వినవస్తున్నాయి. త్వరగా విశ్వనాథం బయటిగదిలోకి వెళ్ళాడు. రామరావు హ్రస్వదృష్టి కావటంచేత ముందేమున్నదో కనబడక “హల్లో! గుడ్‌మార్నింగ్, మిష్టర్ విశ్వం,” అని వట్టికుర్చీకి విష్ చేస్తున్నాడు. వీధిలో నుంచున్న సాంబశివరావు, త్రిలోకీకర్ నవ్వుతున్నారు.

“రండీ, అక్కడ నిలబడ్డారెందుకు?” అని విశ్వనాథం లోపలికి ఆహ్వానించి అక్కడున్న మూడు కుర్చీలు ముగ్గురికిచ్చాడు. లోపలనుంచి రెండు కుర్చీలు తెచ్చి వేశాడు.

“ఐతే మీరిప్పుడు కుటుంబంతో ఉంటున్నారన్నమాట,” అన్నాడు సాంబశివరావు.

“ఔనండీ, ”అన్నాడు విశ్వం.

ఇంతలో మంజు వచ్చింది. విశ్వం మిత్రుల్ని ఒక్కొక్కర్ని పరిచయంచేస్తూ, “వీరు సాంబశివరావుగారు: ఎండోమెంట్సు బోర్డులో ఉద్యోగం చేస్తున్నారు. వీరు త్రిలోకీకర్‌గారు: బి. యల్ చదువుతున్నారు. వీరు రామారావుగారు: పత్రికల్లో వ్యంగ్యచిత్రాలు వ్రాస్తుం

టారు," అన్నాడు.

"తలవనితలంపుగా మిమ్మల్నందర్నీ కలుసుకునే భాగ్యం లభించింది," అన్నది మంజు.

"ఇక్కడ మన ఆంధ్రులు అందులో పరిచితులు దొరకటం కష్టం. మంజుకు యెరిగినవాళ్ళు కనపడకపోవటంవల్ల హృదయం బిక్కు బిక్కు మంటున్నది," అన్నాడు విశ్వం.

"ఇలాంటి పట్టణాల్లో కాలం గడవక పోవటమేమిటి! సినిమాలున్నాయి, పుస్తకాలున్నాయి, మీరున్నారు," అన్నాడు రామారావు, మీరు అనేమాటను నొక్కుతూ.

"విశ్వంగారున్నా లేకపోయినా, ప్రూఫ్‌షీట్లుమాత్ర ముంటాయి యింట్లో," అన్నాడు సాంబశివరావు. ఔన న్నట్లుగా మంజు నవ్వింది.

విశ్వం తన ప్రూఫ్‌రీడరుషిప్‌కి నామరదా కలిగినట్లుగా "ప్రూఫ్‌షీట్లు మాత్రం తీసేసినవా? వాట్లో ఎంత 'మెల్లు హ్యూమర్' వుంటుంది! ఎంత ప్రపంచ ముంటుంది!"

"ప్రూఫ్‌షీట్లో హ్యూమరూ, ప్రపంచమూనా!" అన్నాడు త్రిలోకీకర్.

"ఆహా, దాన్ని అర్థం చేసికోటానికి కవిహృదయం కావాలి, కావ్యానికి రసికుడు కావలసినట్లుగా."

"హిట్లరు ముస్సోలినీలకు వలస రాజ్యాలు కావలసి నట్లుగా," అంది చప్పున అందుకుని మంజు.

"ప్రూఫ్‌షీట్లంటే మీకంత ఎగతాళిగా వుంది. ఈప్రపంచమే ఒకప్రూఫ్‌షీట్."

"మహాపురుషులల్లా ప్రూఫ్‌రీడర్లు," అన్నాడు అందుకుని

సాంబశివరావు.

"అలాగనే వారుచెప్పబోయేది," అన్నాడు రామారావు.

త్రిలోకీకర్ గడియారంవంక చూస్తూన్నాడు.

"మనవాడికి ఈ ప్రసంగమే, గిట్టటం లేదట్టున్నది," అన్నాడు సాంబశివరావు.

"అబ్బె, దానికి కాదు. ఇవ్వాళ్ళ సినిమాకు వెళ్ళాలని వుంది", అన్నాడు లేస్తూ త్రిలోకీకర్.

"అయితే టైమ్ అయింది," అన్నాడు రామారావు. మంజు తప్ప అంతా లేచారు.

"మీరు రారా?" అని అడిగాడు మంజును సాంబశివరావు.

"మంజుకు ప్రయాణబడలిక పోలేదు. నాకు కొంచం పనివుంది. ఈసారికి క్షమించాలి," అంటూ విశ్వం ముగ్గురు స్నేహితుల్తో బయటికి వచ్చాడు.

## 2

"మంజూ నాహృదయాన్ని నీవర్థం చేసికోలేవు. రిక్షాలో నీవు బీచివైపుకు వెళ్ళుతుంటే ఆ లాగేవాణ్ణి చూచి నా హృదయం చాల అసూయ పడుతుంది. నీవెక్కిన రిక్షాను ఈమద్రాసంతా త్రిప్పాలని వుంటుంది," అంటూ త్రిలోకీకర్ కుర్చీని మంజు దగ్గరకు లాక్కున్నాడు.

"ఈరిక్షావాళ్ళసంఘానికి అధ్యక్షుడివి కావాలనిఉందా?"

"ఎందుకు నన్నేడిపిస్తావు? ప్రసంగాన్నె ఎందుకు మారుస్తావ్? ఆ సంఘానికి అధ్యక్షుణ్ణి కావాలంటే నువ్వెక్కిన రిక్షానే ఎందుకు లాగాలి? కాదు......... నీ సౌందర్యం నాహృదయాన్ని అధిష్టించింది. ఇలాంటి

సౌందర్యాన్ని ఎలాంటి నీచత్వానికి పాల్పడినా లోకానికి చాటాలని వుంది. నాహృదయం సౌందర్య పిపాసతో కొట్టుకులాడుతూ వుంది. అయినా ఆపని నీచంకాదు. నా జీవితానికే ఆదర్శం. నిజాగా నిన్ను తనసొత్తుగా చేసికొన్న విశ్వాన్ని చూస్తే నాహృదయం బరువెక్కిపోతుంది. నిన్ను ఇట్లా అలక్ష్యంగా చూస్తుంటే నాకు నమిలి మింగేద్దామన్నంత కోపం వస్తుంది. ఆ అలక్ష్యం ఎందుకు ఏర్పడుతుంది? 'అందగత్తె భర్త పెద్ద క్రిమినల్' అన్నాడు ఒక కవి. ఆమాట నిజం."

మంజుకు కోపం వచ్చింది. "ఏం మాట్లాడుతున్నావో తెలుసా. పైత్యం కళ్ళకెక్కింది. నాయింట్లో, నాముందు, నాభర్తను నిందిస్తున్నావంటే, నిన్నే మనుకోవాలి? ఇంత వరకు వారిని చూచి వృాసుకున్నా. ఇలాంటి పైత్యకారికి నాయింట్లో తావులేదు. నీముఖం చూడకూడదు."

త్రిలోకేకర్ తెల్లబోయాడు. ఒక్కసారి భయంకలిగింది. శరీరం వణికి పోతూవుంది.

"ఇంకా వున్నావెందుకు? వెళ్ళిపో!" అన్నాయి కోపంతో చలిస్తున్న మంజు పెదవులు.

## 3

"మీయింటికి మొదటి రోజున వచ్చినపుడు నాకు చాలా సంతోషం కలిగింది. ఒకవిధంగా మీ జీవితాన్ని చూచి అసూయ పడ్డాను," అన్నాడు మంచంమీద కూర్చున్న సాంబశివరావు.

"ఇప్పుడు మా జీవితమేమీ బాగుండలేదనా మీ అభిప్రాయం?" అన్నాడు విశ్వనాథం దాచుకోలేని బాధతో.

"అబ్బే, దానికి కాదండీ, జీవితంలో ఓవిధంగా, ఒడుదుడుకు లుంటాయి. అప్పటికి మీ ఆర్థికస్థితి బాగావుంది చూచారూ! ఆ ఆర్థికస్థితి చెడిం తరవాత ఒక విధమైన మార్పు కలుగుతుంది."

"ఒడుదుడుకులు లేకపోతే జీవితమేముంది? మానవత్వమే నశించి యంత్రంలాగా తయారవుతుంది. కిందా మీదా పడటం అనేది అభ్యుదయానికి సూచన. ఆలాంటి స్ట్రగుల్లో లేకపోవడమంటే పెంపు అనేది ఉండదన్నమాట."

"లోకాన్ని సన్యసించిన వేదాంతిలాగా మాట్లాడతారేంటి?"

"లోకాన్ని విడిచిన వేదాంత మొకటున్నదా యేంటి? కష్టా లెదుర్కొన్నప్పుడు వాటిని గడిచే ఉపాయం చూడాలి. ఊరక విచారిస్తే ప్రయోజనమేముందీ? ఆ కష్టాలను ఎదుర్కోలేక ఆత్మహత్యకు పాల్పడటం మరీ నీచం — వాటి దాస్యానికే పాల్పడట మవుతుంది."

"ఇంతకూ మీ కేసేమైంది?"

"నష్టపరిహారం నేనే ఇచ్చుకోవాలిసి వచ్చింది."

"తెలిసి తెలిసి ఆవని ఎట్లా చేశారు? భాషాశాస్త్రం చదువుకొన్నారు. అమూల్యాలైన ఆ పుస్తకాల్ని ఎలా దిద్దివేశారు?"

"ఏం చెయ్యమంటారు?" అంటూ విశ్వనాథం తన చేతిలోవున్న తోలుసంచి తెరిచి, "ఇవిగో చూడండి,

ఇవి మొన్నటి వారాని ప్రూఫులు, ఎన్ని దిద్దుబాట్లు న్నాయో చూచారా? ప్రతిరోజూ ఐదారుగంటలు ఇలా ప్రూఫ్‌లు దిద్దుతుంటాను; రాత్రిళ్లు కలల్లో కూడ 'స్ట్రైక్' చేస్తున్న మెషీన్ దగ్గరకు పరుగెత్తికెళ్లి హెడ్డింగుల్లో కూడ తప్పులున్నాయి. ఆపు, ఆపు, దిద్దాలి," అని కేకలు వేస్తుంటాను. ఇదిగో, నాభారతం చూడండి, ప్రతిపద్యమూ ప్రతిపదమూ వేదంలాగ చూచుకుంటాను. మాయకండ యీపుస్తకాన్ని యింత బందోబస్తు చేశాను. ఈలాంటి పుస్తకం నాకీ ప్రూఫ్‌రీడర్ ఉద్యోగం వచ్చింతరవాత ఏమైందో చూడండి. ప్రతిపేజీనా గీటులే. ఏంచెయ్య మంటారు? ఇంత మెకానికల్‌గా తయారైతే బుర్ర తాళపత్ర గ్రంథాల్ని లెక్కిస్తుందా?"

"పుస్తకాలు దిద్దుతుంటే లైబ్రేరియన్ ఎలా వూరుకున్నాడు?"

"పాపం ఆయనికిమాత్రం నాస్థితి గతులేమి తెలుసు? చదువుకున్న వాడిలాగా కనిపించాను. అందువల్ల అతడు నావంకే చూడలేదు. నాపని అవిచ్ఛిన్నంగా సాగించాను. ఆంధ్రభాషాదేవి అదృష్టంవల్ల వదిపుస్తకాలైపోయే లోగానే పట్టుకున్నాడు. లేకపోతే చాలపుస్తకాలు నాచేతులో నాశనమయ్యేవి?"

"ఇంతకూ రీసర్చి ఉద్యోగం పోయినట్టేనా?"

"ప్రూఫ్‌రీడర్ షిప్‌కూడా ఊడినట్టే. పత్రికవాళ్ళు నా కేసు విషయం తెలిసి రేపు తమమీంది కేమన్న తెస్తానేమో నన్నభయంతో 'మంత్' నోటీసిచ్చారు," అన్నాడు నిట్టూరు

విడుస్తూ విశ్వం.

సాంబశివరావు అతని ముఖంలోకి జాలిపడుతున్నట్టుగా చూచాడు. ఇందాక తొణకకుండా వున్న విశ్వం చలించిపోయాడు. ముఖం ప్రక్కకు తిప్పుకున్నాడు. ఐదునిమిషాలు గడిచాయి.

"ఐదు రూపాయలు కావాలి," అని అడిగాడు అనివార్యముగా వచ్చిన గద్గదస్వరంతో విశ్వం.

"ఓ, బై యాల్ మీన్స్. ఇవ్వాళే జీతం యాభైరూపాయలు వచ్చాయి. ఇరవై తీసుకెళ్ళు తరువాత యిచ్చేద్దువు."

"అంత అవసరం లేదు ఐదురూపాయలు చాలు." సాంబశివరావు ఐదురూపాయల నోటిచ్చాడు. నోటు మడిచి జేబులో పెట్టుకొని విశ్వం బయటపడ్డాడు.

"డబ్బు అడగకుండా వుంటే ఎంత బాగుండేది! అతడు దొరకదన్నా కొంతనయంగా వుండేది. నన్ను చూచి జాలిపడుతూ ఇరవై ఎందు కియ్యటానికి సిద్ధపడాలి? ఒకళ్ళచేత కనికరింపబడటంకన్నా చావటం మేలు. దుర్భరం! నాలోని దుఃఖాన్నంతా ప్రజ్వరిల్ల జేశాడు. ఇంతకన్నా కత్తితో పొడిచినా బాగుండేది," అని కటకటపడుతున్న హృదయాన్ని అదుముకుంటూ విశ్వనాథం గృహోన్ముఖు డయ్యాడు.

# 4

"నిజంగా నన్ను ఖూనీచేసి వేస్తున్నావు."

"ఆ! నిజంగా?" అని విశ్వనాథం తెల్లబోయి ముఖం తిప్పుకున్నాడు.

"నన్నిలా పువ్వుల్లో పెట్టి పూజిస్తున్నావంటే— నా హృదయం తల్లడిల్లిపోతున్నది. నీముఖంలో ముడతలేర్పడ్డాయి. నీగుడ్డలు చినిగిపోయి అసహ్యంగా వున్నాయి. తిండికూడ సరిగా తినటంలేదు. ఇలాంటి స్థితిలో నన్నిలా లేనిపోని గౌరవంతో చూస్తూవుంటే నాహృదయాన్ని చిదిమి వేస్తున్నట్లున్నది."

"మంజూ, దీంట్లో విశేష మేముంది? నువ్వొక మానవుణ్ణి లోకానికి ప్రసాదింప బోతున్నావు. నీమాతృత్వం నాకారాధ్యమైంది. అంతే, ఇందులో విపరీతం లేదు."

"నీ ఆరోగ్యాన్ని నీసౌఖ్యాన్ని మానుకొని అవ్యక్త శిశువుకోసం కష్టపడటంలో అర్థముంది?"

"అలాకాదు. ఒక్కొక్క వ్యక్తితో ఈ మానవప్రపంచం మారిపోతున్నది; విజ్ఞానం పెరుగుతూ వుంది. పైగా ప్రతి వ్యక్తిలో గొప్పతనముంది. ఎప్పుడూ ఇద్దరు మానవులు ఒకటిగా వుండరు. ప్రతివాడు వినీలాకాశంలో ఒక ప్రత్యేక నక్షత్రాన్ని అవలోకిస్తుంటాడు. ఆ మినుకు మినుకు మనేతార రెండోవాడికి కనిపించదు. అందుకనే యీ ప్రపంచం ఒక్క మానవుణ్ణి కూడ పోగొట్టుకోలేదు."

మంజు హృదయం త్రొక్కిసలాడింది! ముఖం తిప్పి కిటికీలోగుండా చూచింది. పదినిమిషాల తరువాత త్వరత్వరగా, విశ్వనాథం బుజం పట్టుకుంది.

"నేను చెప్పేదంతా నిజం. నాగరభ్రష్ట పిండం నీదికాదు. అనవసరంగా ఎవరి బిడ్డకోసమో కడుపు కట్టుకుని యిలా అవస్థ పడవద్దు," అని విశ్వనాథం ముఖంలోకి చూచింది.

"ఎవరి సంతానమైతేనేం. అతడు మానవుడు. మానవాభ్యుదయం కోసం ప్రపంచంలోకి అవతరించబోతున్నాడు. ఈవిషయం ఇంతకుముందే చెప్పాను. నాకష్టాలు ఈ రెండు రోజులే వుంటాయి. మళ్ళీ ఉద్యోగం దొరికితే ఏమీం వుండవు. ఆశిశువు విషయంలో ఈ పదిరోజులూ అశ్రద్ధ చేస్తే జన్మంతా దానిఫలిత మనుభవించాలిసి వస్తుంది."

మంజు ఒక్కసారి అతనికాళ్ళమీద పడి అశ్రుధారలతో కడుగుతోంది. గొంతు సవరించుకొని "నీకు ఘోరమైన అపకారం చేశాను. నీ ఉదాత్త హృదయాన్ని అర్థం చేసికోలేకపోయాను. తుచ్ఛమైన తాత్కాలిక సుఖంకోసం నీకు కళంకం తెచ్చాను. నీవే నాలాగా ప్రవర్తించినట్లయితే ...... లేదు క్షమించాలి ... " రుద్ధకంఠమైంది.

"నీ వేంచేశావ్? ఇందులో నీతప్పేముంది. నేనిదివరకే చెప్పాను. మనలో ఆకలి లాంటి కామముంటుంది. ఆక్షుద్బాధ తీర్చుకోవాలి. గత్యంతరం లేదు....... ప్రేమ అనేదిలేదు, నిజంగాలేదు. కామ మనేదే వుంది. ప్రేమ ఉండదనుకొని జీవించేవాళ్ళతో పేచీ పెట్టుకో నక్కరలేదు. ఎందుకు వెక్కివెక్కి ఏడుస్తావ్? —నూతన భావాలకోసం నీదుఃఖాన్నికూడా గమనించటం లేదనుకుంటున్నావా? లేదు. లేను. లేదు. నీశాంతికోసం, కేవలంగా నీహృదయ తాపాన్ని పోగొట్టటానికి చెబుతున్నా. ఇది నామనస్ఫూర్తిగా చెబుతున్నా ఏడవకు. నమ్ము. అలా ఏడిస్తే ఎలా? పండ్లరసం తాగి సుఖగాం

నిద్రపో. నేను బజారుకు వెళ్ళివస్తాను," అంటూ విశ్వ నాథం పండ్లరసం తీసి మంజు కిచ్చాడు. ఆమె టేబులు మీద పెట్టింది. "సరే నేను మళ్లీ రెండుగంటల్లో వస్తాను," అని బయటికి వెళ్లాడు.

మంజు విషాదచ్ఛాయ లా గదిలో ఒకటి రెండుసార్లు పచారు చేసింది.

"మహాపరాధం చేశాను. అలాంటి ఉదాత్తహృదయంలో విషకంటకం గుచ్చాను. అతనిముఖం ప్రశాంతంగావుంది. కోపం గాని, విచారం గాని, అసలి వేపే తొంగి చూడలేక పోయింది. ఎంత పాపం చేశాను? అలాంటి విశాలహృదయాన్ని అనుభవిస్తూ యిలా నీచంగా ప్రవర్తించానంటే ......... లేదు లేదు, మహాఘోరం. త్రిలోకైకర్ను తరిమివేసిన నాపవిత్రహృదయం ఆతుచ్ఛుడి వైపు చేతులు చాచిందంటే నాకే అర్థంకావటంలేదు. రామారావు నన్ను అలక్ష్యం చేస్తున్నట్లు ఎందుకు ప్రవర్తించాలి! అందికలో లేని వస్తువులమీద పుట్టేవాంఛలాగా నాకతన్ని వశంచేసుకోవాలని బుద్ధి ఎందుకు కలగాలి. కష్టంతో సాధించిన దానిమీద అంత మక్కువ ఉంటుంది కామాలు. మొదటిరోజుల్లో అతడు నన్ను చీదపురుగు లాగా చూస్తుంటే నాహృదయం అతన్ని ఎట్లాగైన వశం చేసుకోటానికి తయారైంది. ఈ పాపానికి ఒడికట్టింది. ఏంచేస్తున్నాను. నా ప్రవర్తననే సమర్థించుకోవడమా? లేదు. నన్ను నేను మోసం చేసుకున్నట్టుగా హృదయానికి తగులుతూవుంది.నావిశ్వం హృదయాన్నుంచి

స్రవించే మధురామృతాన్ని ఆస్వాదించటమే నాజీవితానికి పరమావధి.........నాపాపానికి స్వరూపాన్నిచ్చి కళ్ళెదుట పెట్టుకుని అతనికి సేవచేయలేను. నా హృదయాన్ని రౌరవ నరకజ్వాలల్లో పడవేయలేను. అతడు మనస్ఫూర్తిగా నావల్ల తప్పు లేదనుకోవచ్చును. అతన్ని సంపూర్ణంగా ప్రేమించే నాహృదయం అతనికి జరిగే ద్రోహాన్ని సహించలేదు. క్షమించలేదు." అంటూ మంజు దాపున వున్న మంచంమీద వాలింది. ఒకక్షణం కూర్చుని తరువాత తనమీద కోపంతో గదంతా అలంగం తిరిగింది. పాదాల సవ్వడి గట్టిగా వినిపిస్తోంది. ఆల్మైరా దగ్గరకు వెళ్ళి గిన్నెలో వున్న ద్రవాన్ని త్రాగివేసి మంచం మీద పడుకున్నది.

విశ్వనాథం వచ్చేటప్పటికి మంజు దొల్లిగింతలు పెడుతూనే వుంది. ఆమె అవస్థను చూచి

"అలా వున్నావేం?"

"ఏమీ లేదు, సుఖంతో బాధపడుతున్నా," అంది, బాధలో నవ్వుతూ.

"నాకేమీ అర్థంకావడం లేదు."

"నాపూర్వద్రోహాన్ని మళ్ళీకనపడకండా చేశాను. అదిగో ఆ అమృతాన్ని తాగాను," అంది చూపుల్తో ఆల్మైరాలో గిన్నె చూస్తూ.

"ఏంచేశావ్?......అవాచ్యపాతకం"

విశ్వనాథం ముఖంలో అసహ్యతా రేఖ తోచింది. నిలువున నీరయ్యాడు.

"నీగర్భస్థ శిశువు నీకేమి అపకారం చేసింది? లేదు. లేదు. నీవు పట్టి పాతకివి. నీ మాతృత్వమే త్రిలోకారాధ్యమైన మాతృత్వమే - నశింప జేశావు. నీమాతృత్వానికి నీవు గర్వపడవలసివుంది. దాన్నే నీవు గౌరవించుకో లేక పోయావు. సమూలంగా నాశనం చేశావు మగవాళ్ళు మిమ్మల్ని యిక దేనికి గౌరవించాలి? లేదు, లేదు. నీవు మూర్తీభవించిన పాపానివి. నీముఖం చూడలేను." విశ్వనాథం ముఖం తిప్పుకున్నాడు.

ఆయాసంతోను ఆవేగంతోను మంజు విశ్వం చెయ్యి పట్టుకుని "నీహృదయం కరుణార్ద్ర మనుకున్నా. నా పాపఫలమైన శిశువుని ఒళ్ళో పెట్టుకుని నీదగ్గర నేనెల్లా వుండేది? నిన్ను నా హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నా. నిన్ను విడిచి ఉండలేను. నిన్ను ప్రేమిస్తున్న నాహృదయం నీయందు జరిగిన అన్యాయాన్ని సహించలేదు. అలాంటప్పుడు ఈశిశువుని బ్రతికినంతకాలమూ, నాహృదయం కాలకూట విషాగ్నిజ్వాలల్లో కాలిపోతోంది. అంతకంటే మరణం మేలు. ఇలాంటిశిక్ష నాకు విధించాలనుకున్నా వన్నమాట. క్షమించు. ఇట్టిశిక్షకు నేను పాత్రురాలను కాను నీహృదయం మెత్తనిది. క్షమించు," అని కన్నీళ్ళు కార్చింది.

విశ్వం ముఖం తిప్పకుండానే కోపంతో "లేదు, నీకూ నాకు సంబంధంలేదు. నాహృదయం, విశ్వశ్రేయస్సు కోరే నాహృదయం క్షమించలేదు. నీ సుఖంకోసం కేవలం అభము శుభము ఎరగని శిశువుని చంపివేశావు. ఇలాంటి

ఘోరాన్ని ఎవరు సహించినా నాహృదయం సహించదు. నీవు పట్టి పాపిని. భ్రూణహత్యా పాతకి అయిన భార్య కంటె వ్యభిచారిణి ఐన భార్య మేలు. ఇక నీదారి నీది. ఇకెప్పుడు మన తెన్నులు కలవ్వు,"అంటూ చెయ్యి విదిలించి కొని వీధిలోకి వెళ్ళాడు.

# దీపావళి నాడు

దీపావళీ అమావాస్య. ఆబాల గోపాలమూ ఆనందములో మునిగి తేలే రోజు. బాణసంచాలు, అవుట్లు కాల్చే పట్టణ వాసులంతా వినోదంగా వెళ్లబుచ్చుకునే రోజు అయినా సనాతనులు, ధర్మపరాయణులు అనబడే మతాభిలాషులు మాత్రం, శ్రీకృష్ణ-సత్యభామల పటాలు ముందెట్టుకొని పూజించి, సత్యభామ చాకచక్యాన్ని గోరంతలు కొండంతలుగా చేసి చెప్పుకుంటూ, నరకాసురుడి కోసం దుఃఖ బాష్పాలు జార్చే దినం. వీరు స్వార్థ తృప్తికని బాణసంచా కాల్చరుగాని భూదేవి తృప్తికొరకు మాత్రం "నరకాసురా! ధన్యుడవు, ధన్యుడవు!" అంటూ దివిటీలు కాల్చి, చితి పేరుస్తారు. శతాబ్దాలనాడు హతుడైన నరకాసురుణ్ణి ఆరోజు ప్రతి సనాతనుడు విధిగా స్మరించుతాడు. దానివల్ల ఆ నరకాసురుడికి తృప్తి, వారికి ముక్తి లభించుతాయి.

ఇక భాగ్యవంతులకు మాత్రం యిది వొక మహదానంద సమయం. కటిక అమావాస్య అయినప్పటికీ, వారు ఇంటి ముందట సూర్యుని ధిక్కరించే వెలుగు నిర్మించుకొని పట్ట పగలు చేసుకుంటారు. ఓ ప్రక్కన బాణసంచా కాలుతుంటే యింకో ప్రక్కన అవుట్లు పేలుతుంటయి. మరో ప్రక్కన చిచ్చుబుడ్లు. అది నలుగురికీ విందొనర్చి జలసా చేసుకునే రోజు. బాణసంచాల ఫెళఫెళార్భటులలో, జలసా మైకంలో, ప్రపంచాన్నేగాకుండా తమ్ముతామే మరచి పోతుంటారు శ్రీమంతులు. ఈమానవజాతిలోనే యింకో

తెగవారికి మాత్రం బాణసంచా కాల్చుకోలేని—కాదు, వాళ్ళేకాల్చుకునే—రోజు. దీపపు చమురు తెచ్చుకోలేని వీరి పన, దివిటీదా కానా?

ఆనిరుపేదల వాకిళ్ళముందు మాత్రం, పిల్లలు మారాము చేసి కొనిపించుకొన్న తాటాకు టపాకాయల కట్ట దీపందగ్గర పెట్టుకొని కాల్చుకుంటున్నారు. ఏమైతేయేం? హిందూదేశాన్నంతటినీ ఆనందసాగరంలో వూగులాడించే రోజు. ఆఒక్క క్షణం మాత్రం, ప్రతి కష్టజీవి తనతోడివారి ఆనందం చూచి ఆశలు కల్పించుకొని గాలిమేడలు కడుతుంటాడు.

ఆ ఆనందాన్నంతనూ, కన్నార చూచి చూచి, అమవశినిశి అలసిపోయి, విశ్రాంతికై బయలుదేరింది. మొక్కినకొద్దీ త్రొక్కుతూ తన్ను నిరసించిన కఠిన లోకాన్ని బహిష్కరించాలనిచెప్పి, ఒంటిగా వరుండి కుములుతున్న కవి కుమారుని ఆహ్వానించాడు ఆ కాళరాత్రిని. నన్ను నిరసించిన లోకపు ఆనందంలో నేను పాలు గూడను. ఏపాపము యెరుగని నువ్వే నాకు సఖివని చెప్పి కోయిలస్వనంతో గొంతెత్తి ఏడ్చిన కవి కుమారుడికి దుఃఖంలోనే ఆనందాన్ని చవిచూపించి, దీపావళిరాత్రి ఉయ్యాలో, జొంపాలో, కొట్టి నిద్రబుచ్చింది. ఒక్క శీతారామయ్యకు మాత్రం అమవశినిశి గూడా కనికరము చూపటానికి నిరసించింది.

శీతారామయ్య ఎం. యే. ఫస్టుక్లాసులో ప్యాసయ్యాడు. పాతికయేళ్ళు నిండకపోయినా, మంచి అనుభవశాలి.

ఇష్టంవున్నా లేకపోయినా, అతను తెలివిగలవాడని వచ్చినట్లు ఒప్పుకుతీరాలి. తన అందానికీ, తెలివి తేటలకూ, లోకం తనకు బ్రహ్మరథం ఎందుకు పట్టదా అనే, అతని ధీమా. శీతారామయ్య చిన్నప్పటినుంచీ అతి గారాబంగా పెరిగాడు. అంత అబ్బురంగా పెరగబట్టే జీవితంలో ఏకాస్తపొరపాటైనా అతన్ని కలవరపరుస్తుంది. దానిమీాదట ఎంతో వ్యధచెందుతాడు. అందుకనే నవ నీతంలాటి అతని మృదువయిన హృదయం ఈ బాధల చేత నంటలుపడ్డది. శీతారామయ్యని గురించి చిన్నప్పటి నుంచీ నాజూకు మనిషనీ, గర్వపోతనీ అపోహాతో లోకులు తేలికగా మాటాడినా, అతనుమాత్రం ప్రపం చాన్నిగురించి ఏవిధమైనటువంటి దురభిప్రాయమూ లేకుండానే గడుపుకుంటూవచ్చాడు కొంతకాలం.

శీతారామయ్యతండ్రి వుత్త అమాయకుడు. బాధ్యతా బాధ్యతలు తెలిసిన మనిషిగాడు. ముందుజాగ్రత అనేది ఏ కోశాన్నీలేక, తన ఆస్తి కాస్తా అసలువున్నా అంతా నికి లేదనిపించాడు. తల్లి ముందే గతించింది. తా మున్నంతకాలమూ సుఖంగా జీవించడమే చూసుకున్నారు గాని, 'అబ్బాయి ముందుగతి ఏమూ?' అని తలపోసిన పాపానికి పోలేదు. వీళ్లు పితృదేవతలట! వీళ్ళను సంస్మ రించమంటుంది, పూజించమంటుంది మూఢలోకం!

శీతారామయ్య ఎం. యే. పూర్తిఅయ్యేసరికి తండ్రి కూడా పరలోకానికి వేంచేశాడు. చూస్తూవూరుకోలేక శీతారామయ్యను చేరదీశాడు, ఒక బంధువు. ఆయన

వుండేది పట్నవాసం. ఆయనకు నలుగురు కొడుకులు, ఒక్క కూతురు. ఆయనకైనా ఆస్తి చూడబోతే మృగ్యమే—ఒక కొడుకు ఫ్యాక్టరీలో గుమాస్తా. మరో కొడుకు కిళ్లీ దుకాణం పెట్టాడు. మిగతా యిద్దరు మగపిల్లలూ చిన్న వాళ్లు. 'మనయింట్లోనే పెరుగుతున్నాడుగదా, అమ్మాయిని చేసుకోడా' అని ఆ బంధువు ఆలోచన. సీతారామయ్యగూడా వుద్యోగం దొరక్కపోవటంచేత ఆయన పెట్టే మెతుకులకే ఆశపడ్డాడు. బంధువులమీద ఆధారపడి వుండవలసివచ్చిందిగదా అని అతనికి మనసులో చాలా యిబ్బందిగా వుండేది. ఆధారపడక చేసేదీ లేదు. ఏకిళ్లీ కొట్టయినా పెట్టుకుందామంటే ఆమాత్రపు దమ్ముల్లేవు.

సీతారామయ్య ఒక్కొక్కసారి గంటలకొద్దీ ఏదో ఆలోచిస్తూవుండేవాడు. జీవయాత్ర ఎట్లాగా సాగించటము అనే అతని జిజ్ఞాస. ఆలోచించినకొద్దీ జీవయాత్ర మీది మోజే నశించింది. కాని సాగించక చేసేదేమిటి? అందుకనే అభావంగా వుండటం అభ్యసించాడు. ఈ పడవ ఏబండకైనా తగిలి పగిలిపోతుందేమోనని యిదివరకు భయపడేవాడు. ఇప్పుడు ఏ తుఫానన్నా రావాలని కోరుకుంటున్నాడు. ఆ తుఫానులో యీ పడవ తగులుకొని తల్లక్రిందులైతే ఎట్లావుంటుందో అన్నదే, అతడి యిప్పటి ఉబలాటం. ప్రపంచాన్నిగురించి తర్కించవంత వరకు అందరిలాగానే బ్రతికాడు. కాని రాను రాను, ఆలోచనలు పోనుపోను, మానవులంటే అసహ్యము వేసిపోయింది.

ఆ అనహ్యాం వెళ్లి వళ్లి, జాలిగా మారింది. ఇప్పుడతను మానవులనుగురించి చాలా జాలిపడతాడు. మానవులంటే ఏమిటో అర్థంచేసుకోలేక హృదయమనేది మానవజాతికి ఎన్నో మైళ్ళదూరంలో వున్నదనుకుంటూ, మూడుపూటలా మెక్కి, ప్రొద్దుగూకేసరికి పశుతుల్యంగా—తన సర్వ స్వాన్ని ఒప్పజెప్పేభార్యను జూచి మురిసిపడటం, విజ్ఞాన వంతురాలైన భార్య సరిసమానుడైన భర్త దొరికినందుకు సంతోషిస్తూ విజ్ఞానాన్ని వినియోగించుకోవటం చేత గాక, తానూ పశుప్రాయంగా భర్తపాలు చేయబోయే తన సౌందర్యాన్నిచూచి మురిసిపోవటం, చూస్తుంటే—శీతారామయ్యకు ఎంతో కనికరం వేసేది.

శీతారామయ్య బంధువుగారి కూతురు, మూర్ఖ రాలు. గొంతెట్టుకొనిఅరిచిబ్రతకటంమాత్రంనేర్చుకున్నది. ఈడువచ్చినపిల్లయినా యింట్లో తనకేమాత్రం లోటు జరిగినా పెద్దబొబ్బలెట్టుకుంటూ వీధినిబడుతుంది. ఏడ్చివడ్చి యిల్లుచేరగానే తల్లి బట్టను బాదినట్లు బాదటం, మళ్లా ఏడుపుసాగించటం. ఇదంతా చూస్తుంటే, శీతారామయ్యకు ఆ యింట్లో వుండటమంటేనే అసహ్యము వేసేది.

అటువంటిసమయంలో, ఆపిల్లను తనకిచ్చి పెండ్లిచేయటానికే తన్ని చేరదీశారన్న సంగతి చూచాయగా తెలిసిన దగ్గరనుంచీ, అతనికి జీవితం మరీ దుర్భరమనిపించింది. అప్పుడప్పుడు చెప్పకుండా పారిపోదామా అనిపించేది. పశువును తను పెళ్లిచేసుకోవటం అనేసరికి, శరీరం గగ్గు

ర్పాటు చెందేది. తనకాలేజీజీవితమంతా కళ్లకుగట్టినట్లయ్యేది.

అదేమి ఖర్మమోగాని, శీతారామయ్య కాలేజీలో చదివేటప్పుడు ప్రతివాళ్లూ నెత్తినెక్కించుకునేవాళ్లు. సంఘంలో అతనికి ప్రధానస్థానముండేది. అతనికి ఎంతోమంది స్నేహితురాండ్రు వున్నారు. స్నేహితురాండ్రంతా అతణ్ణి గొప్పమేధావి అని చెప్పి ఆరాధించేవాళ్లు. ఆసంఘంలో వున్నంత సేపూ, తనను తనే మరిచిపోయి తానూ ఒక దేవతాస్వరూపమేనని మురిసిపోయేవాడు. వేళ తెలియకుండా గంటలకొద్దీ కళనుగురించి, వివాహ సమస్యను గురించీ వుపన్యసించేవాడు. వాళ్లు తన్ను పొగుడుతున్నకొద్దీ వుబ్బిపోయేవాడు.

పెండ్లినిగురించి తను వుపన్యసిస్తున్నప్పుడు ఏ స్నేహితురాలైనా "అయితే పెండ్లిచేసుకోరూ?" అంటే, ఒక చిన్న నవ్వునవ్వి, "నేనూ మానవుణ్ణే" అనేవాడు. అంతవిజ్ఞానం గల తన స్నేహితురాండ్రు సైతం, తనపరోక్షంలో తన్ను గురించిమాట్లాడుతూ, "అవును. గొప్పమేధావే. కానీ భాగ్యంకూడా వున్నట్లయితేనా—" అని అంటూవుంటారని తెలిసినప్పుడు తన స్నేహితురాండ్రను గురించి ఎంతో విచారపడేవాడు. అట్లాంటి శీతారామయ్య, పెండ్లికి ఒప్పుకొని, అందులో ఒకనరపశువును మెడకు గట్టుకుంటాడంటే, ఎవ్వరూ నమ్మరు. ఆ పిల్లను తను పెండ్లిచేసుకోవాలి అనేసరికి తన కాలేజీ స్నేహితురాండ్రు జ్ఞప్తికి వచ్చి యీపశువును తాను పెండ్లిచేసుకుంటే వాళ్లు విని తన్ను గురించి ఏమిగా భావిస్తారో అని వేదన పడేవాడు.

తన్ను గురించి వేదనపడేకంటే అంత విజ్ఞానమున్నదను కొంటున్న ఆస్నేహితురాం[డ్రు ధైర్యం చేయలేక పోయి నందుకు నొచ్చుకొని బాధపడితే బాగుండేదేమో. ఏమై తేయేం! పెండ్లి అనేసరికి అతని మనసంతా దిగులుగా వుండేది. ఒక్కొక్కటి వ్యక్తి రాత్రిళ్లు బాహ్యరుమని ఏడవ బుద్ధి పుట్టేది. పెళ్లిలో వున్న సాధక బాధకాలన్నీ పెళ్లి చేసుకోకుండానే, అవగాహన చేసుకున్నాడు. పెళ్లంటే పరమ అసహ్యమనిపించింది. అంతటివిజ్ఞానవంతుడు, తనంతటిజ్ఞానము వుండి, ఒకరిహృదయాలొకరికి పరస్పరమూ తెలిసివున్న, తనతోటి సహవాసినులలో, ఏఒక్కరిని భార్యగా తీసుకొందామన్నా, వాళ్లకూ అతనికీ, మధ్యవున్న ధన కంటకము అడ్డుతగలటం నిజంగా హేయమైన సంగతి.

## 2

ఆనాడు దీపావళికావటంచేత తన బంధువు తెచ్చిన దీపావళీ సరుకులు పంచుకోవటంలో తన చిన్న అన్నలతో పోట్లాడి తనకిచ్చిన సరుకులు విసిరి నేలకుగొట్టి పెద్దపెట్టున ఏడుస్తున్న (తనకాబోయే) భార్యను—అసంభవం!—తన బంధువు కూతుర్ని—చూచేసరికి XOX వెర్రులెత్తినయి. అతనికి కడుపులో చిచ్చుబుడ్లు కాల్చినట్లు అనిపించింది. అతని కళ్ళల్లో తుపాను చెలరేగింది. కుర్చీలో కూర్చుని ఆలోచించాడు. భావతరంగాలలో పైకీ క్రిందికీ వూగులాడాడు. డబ్బు లేకపోబట్టేగదా తను బంధువుల యింట్లో చేరాలిసొచ్చింది అని కించ పడ్డాడు. అతన్లో ఒక

పెద్ద విప్లవం చెలరేగింది. ఒక్క పూట తిండానికైనా లేక కడుపులు కాల్చుకొంటూ, కట్టినగుడ్డ వుతకేస్తే చిరిగిపోతుందేమోనని భయపడి నెలలపాటు మురికిగుడ్డలే కట్టుకుంటూ, బ్రతికినవాళ్ళల్లోనూ, అటు చచ్చినవాళ్ళల్లోనూ, లెక్కగాని జీవచ్ఛవాలు కొన్నివుండే — వాటిప్రక్కనే సర్వసౌభాగ్యాలు అనుభవిస్తూ, పుట్టినందుకు ఆత్మానందమే పరమార్థమని విర్రవీగే భోగలాలసులు వున్నందుకు మానవ ప్రపంచం చరితార్థమయిందికదా అనుకున్నాడు. "అదిభగవంతుడి విలాసమా!" అని గునిశాడు.

చిన్నప్పటినుంచీ అతనికి భగవంతుడంటే భక్తి లేకపోయినా, భయముండేది. దేవుణ్ణికనక తిట్టితే ఆరోజున ఏ తేలు కుడుతుందో, లేకపోతే దేవుడే ఏ దయ్యంరూపములోనన్నా కనపడి ఏమన్నా చేస్తాడేమో, అని భయపడేవాడు. ఎప్పుడన్నా, "దేవుడూ, లేడూ దయ్యమూ లేదూ" అని ఎవరితోనన్నా వాదించినా మళ్ళీ వెంటనే స్మితపడి, లోలోపల తిట్టుకుని "ఆత్మే దేవుడు" అని బహిరంగంగా చెప్పి, సమాధానపడేవాడు.

అంతటితో వదలక దేవుణ్ణి అగ్నిపరీక్షకు లోనుజేసేవాడు. దుష్టశిక్షణమే దేవుని వుద్దేశ్యమైతే తన్నెందుకు శిక్షించడో చూద్దామని వాగ్వాద మొచ్చినప్పుడు తన స్నేహితుల్ని అనవసరంగా దూషించేవాడు. ఒక్కొక్కసారి అల్పజీవుల్ని ఎన్నింటినో చంపేవాడు. ఆరోజు ఏకాస్త తలనొప్పి వచ్చినా దానిఫలితమే అనుకునేవాడు. దేవుడు ఉన్నాడుఅని స్థిరపరుచుకొనేవాడు. ఏమీ జరక్క

పోతే, దేవుడు లేడేమోనని శంకించేవాడు. అటువంటి శీతారామయ్య, నేడు దేవుడిమీద తిరగబడ్డాడు. ఒకడికి తింటానికి లేక ఏడుస్తుంటే యింకొకడు తప్పతాగటానికి డబ్బు ఖర్చుపెడుతూవుండటం చూస్తూ వూరుకోవడమేనా దేవుడి చిద్విలాసం! అనుకున్నాడు. అయితే, కడుపులు కాల్చుకొని బ్రతుకుమీద అసహ్యంవేసి, చావడానికి సాహసించలేక, వేదనపడి కృశించే జీవుల్ని అట్లాగే వుంచడమా, దేవుడి వుద్దేశం? అదే అయితే, దేవుడికంటె మానవుడే ఉత్కృష్టుడులే, అనుకున్నాడు. అసలు దేవుడు వున్నాడా లేక స్వార్థపరులైన కొందరు తుచ్ఛులు మతం పేరుచెప్పుకొని పొట్టలు పెంచుకోవడానికి వేసిన ఎత్తా, యిది? అదే నిజమైతే దేవుడు నిజంగా రాతిగుళ్ళోవుండే శిలావిగ్రహమే. అంతే. ఆ రాతికి మ్రొక్కమని యితరులను మోసపుచ్చి బ్రతికటమా! దేవుడికి దున్నుకుంటానికి పొలమేదీ, మెళ్ళో నగలేవీ, అని పిచ్చి ప్రజనుంచి గుంజి, పొలాలు భుక్తంచేసుకొని, నగలు పిల్లలమెళ్ళల్లో వేయుటమేనా, మతకర్తలపని? సర్వము నాదే, సర్వములోనూ నేనున్నాననే ఆ దేవుడు పెద్దమనిషికి, పొలం గావాలీ దున్నుకోటానికి? అంతా మోసం, అనుకున్నాడు. దేవుడుగూడా బీదరికం తప్పించుకోలేకపోయాడేమో, అని నవ్వుకున్నాడు శీతారామయ్య. ఎంతసేపు ఆలోచించినా అంతులేకపోయింది.

ఇంతలో బాణసంచా ఒకటి ఫెళ ఫెళా అని శీతారామయ్య బంధువు యింటిమీదుగా దూసుకు పోయింది.

శీతారామయ్య ఉలిక్కి పడ్డాడు, ఆలోచనలనుంచి. అవును నిజమే. శీతారామయ్య ఆలోచించింది ఏమీ తప్పుగాదు. దేశంలో కోటిమానవులు అష్టకష్టాలు పడుతూ, నానా బాధలు అనుభవిస్తూ, కడుపులుచీల్చుకొని, తలలు దూర్చుకొంటుంటే, శ్రీకృష్ణ సత్యభామల పటాలు ముందెట్టుకుని కూర్చోడానికి యీ మతకర్తలకు ఎవ్వరిచ్చారు హక్కు? చీకూ చింతా లేకుండా ముప్పూటలా యితరులసొమ్ము మేసి, కడుపుచిచ్చుతో మాడిపోయే వాళ్ళు ఎక్కడ తిరుగుబాటుచేస్తారో అని "దేవుడు, కర్మ" అని కల్పించటం, మతకర్తలు వేసిన ఎత్తుగాదూ?

శీతారామయ్య, ఆలోచనలనుండి బైటపడే సరికి పట్టణం చాలావరకు మాటుమణిగింది. అక్కడక్కడ ఏకొద్దిమందో, మిగిలిపోయిన మందుసామానులు కాల్చుకుంటున్నారు. కూనిరాగాలు తీస్తూ (వాటిలోగూడా విషాదం నృత్యంచేస్తూంది) లైటుతెచ్చి బల్లమీాదపెట్టి 'షా' నాటకం తెరిచాడు. తెరిచాడేగాని చదవ బుద్ధిపుట్టలా. పుస్తకంమూసి వాకిట్లోకి వెళ్ళి పచార్లుచేయుటం మొదలెట్టాడు.

నిద్రపట్టకనో, మరెందుచేతనో పక్కయింటి ప్లీడరుగారి భార్యాకూడా బైటికొచ్చింది. ఆవిడ శీతారామయ్యను చూడలేదుకాని అతను ఆమెను చూశాడు. ఎలెక్ట్రిక్ దీపాల వెలుతురు వెన్నెల్ని మించివున్నది. శీతారామయ్య అడుగుల్లో అడుగులు వేస్తూ ప్లీడరుగారి యింటివేపు బయలుదేరాడు...దగ్గిరకు సమీపించాడు గూడా.

...కాని ప్లీడరు భార్యా అప్పటికీ యింకా అతన్ని చూడనే లేదు. శీతారామయ్యా శరీరమంతా గజగజ వణికిపోతూంది. అతని కళ్లలో నేగాదు, ప్రతిఅవయములోనువిరక్తి, అసహ్యము, జాలి, పస్ఫుటంగా కనుపిస్తున్నయి. వణకుతున్న కాళ్ళతో, పైకీ లోపలికీ వుబుకుతున్న గుండెపడతో, ప్రళయతాండవ నృత్యకేళిలో మునిగి పోతున్న చూపులతో, అవ్యక్తంగా ఆవిడమీద ఎగబడ్డాడు. ప్లీడరుభార్యా శీతారామయ్యను యిదివరకు బాగా ఎరుగును. అతను మంచి ప్రవర్తన గలవాడని కూడా, భర్త తనకు ఎన్నో సార్లు చెప్పివున్నాడు. అటువంటి శీతారామయ్యా, యిట్లా తయారయ్యాడా, అనుకొని ఆవిడ నిర్వేరపాటుతో, స్తంభించిపోయింది: నోటమాట రాకపోయింది. తన సహజ కోమలత్వం నశించి, దానికిబదులుగా తనలో ప్రవేశించిన రాక్షసత్వముతో శీతారామయ్యా పతివ్రత అని తనకు తెలిసి కూడా ఆ యిల్లాలిని అమాంతంగా చెరిచాడు. చెరవడమే తడవుగా లేచి నిలబడి "దేవుడవా, పిరికిపిశాచమా!" అని కర్కశంగా అరిచాడు. కావలసినదంతా అయిన తరవాత, తెలివొచ్చి అరచిన యిల్లాలిని ఓదార్చడానికి, భర్త అతని వెంట ఎంతోమందిన్ని వచ్చారు. కాని అసలు మనిషి మాట యేమిటి!—

తెల్లవారింది. ప్లీడరు వాకిట ఎదురుగావున్న యెలెక్ట్రిక్ స్తంభందగ్గర ఓ వ్యక్తి పడివున్నాడు. జీవంలేదు. ఎక్కడి జనమూ గుంపుగూడుతున్నారు. "అయ్యో శీతారామయ్యా" అంటూ శీతారామయ్యా బంధువు గుంపులో

నుంచి తోసుకు వచ్చాడు శవందగ్గరకు. కాని రాత్రి జరిగిన కథ ఎవ్వరికయినా తెలియదు. పేదరు భార్యకు కూడా ఈసంగతి స్మృతిలేదు. "పాపం! సీతారామయ్య చాలా మంచివాడు" అని చెపుతుంది ఆవిడ, అక్కడి స్త్రీలందరితోను. ఆరాత్రిమాత్రం పతివ్రతా మహిమతో, నిన్ను కాల్చి దుమ్ము చేస్తానన్నంత కోపంలో, [illegible] జంబుకాన్ని, దేవుణ్ణి లేపి, ఇంతపాటి జంతువుతో [illegible] "పీనుగ పందా! నీవల్ల పతివ్రతలకు భంగమా? అప్రమత్తుడవై కాపాడుకో, నీభర్తల్ని" అంటూ తలపైకెత్తి, [illegible] పెద్దవిచేసి, వక్షాన్ని ముందుకు పొడిచింది, [illegible]భార్య.

# ఆడమళయాళం

"గోపీ"

"వస్తున్నా" అన్నాడు గదిలోనుంచి.

"ఇంకెంతసేపు? కారువచ్చి గంటసేపవుతుంది. అబ్బా పురుషులకున్న రోగమే ఇది. సింగారం...సింగారం... సింగారం...రోజంతా సింగారమే! పనితొందరా తెలియదు, పాడూ తెలియదు. గోపీ...గోపీ"

కాశ్రీపు దువ్వుకునేటప్పటికి ఇంకో లక్ష. "కొంచం సేపు ఆగలేవా?" అన్నాడు గదిలోనుంచి బయటికివస్తూ.

"ఆగలేను గోపీ, నీ అపూర్వసౌందర్యం నన్ను తనలోకి గుంజుకుంటోంది. నీవు లేనప్పుడు నేననుభవించే విరహబాధ నన్ను భయపెడుతోంది. గోపీ, గోపీ, నీ సౌందర్యం నీకు తెలియదు కాని...నీ సౌందర్యం పురుషులు మెచ్చుకోలేరు. కాని..."

"చాల్లే, ఊరుకో"

ఎలిజా ముందు తానొక స్త్రీనయిపోతున్నానని చీకాకు పడ్డాడు.

"ఊరుకోలేను గోపీ"

"ఊరుకోవాలి ఎలిజా"

"స్త్రీ హృదయ తంత్రులు అతి సున్నితమైనవి" సీరియస్‌గా మొదలు పెట్టింది ఎలిజా. "అవి గాలి అలల రాపిడికే ప్రతిధ్వనిస్తాయి. కనుక దేనినీ ఓర్చుకొని ఊరుకో లేదామె."

గోపీ ఎలిజా కన్నులలోకి నవ్వి "పద పోదాము" అన్నాడు.

"ఆలస్యమైంది, కారెక్కి పోదాం"

"కారు నాగరిక ఘోషాపద్ధతి. సౌందర్యవతులకు కారెందుకు? టిక్ టాక్ మంటూ బజారు వెంట నడచిరాక" అన్నాడు గోపి.

"నేనయితే అంతే చేసేదాన్ని; కాని పురుషపుంగవుడవు నీవున్నావుగా! నీకోసమే కారు తెప్పించాను. వీధులలో తిరిగితే నీకు తప్పక దిష్టి తగులుతుంది. మళయాళీ స్త్రీల చూపులు పురుషుల అందాన్ని తమలోకి పీల్చు కుంటాయి. అమ్మో! నా గోపీని కారు లేకుండా పది మంది చూపుల్లో పడేటట్లు నడిపిస్తానా నేను."

ఇద్దరూ కారు సమీపించారు. ఎలిజా డ్రైవరు సీటులో కూర్చుంది. ఆమె ప్రక్కనే కూర్చున్నాడు గోపి. కారు బయలు దేరింది.

"రాజుగారు జన్మిస్తే ఈరాద్ధాంత మెందుకు? జన్మించడం అనే ఘనకార్యం చేశాడనా? పోనీ మీరాజుగారు జన్మించి నందుకు మీరు సంతోష పడాలి గాని మధ్య నాకెందుకు? నన్ను అనవసరంగా బయలుదేర దీశావు ఎలిజా, ఆ వస్తు ప్రదర్శన శాలకు నేనెందుకు చెప్పూ... చెప్పూ?"

"వస్తు ప్రదర్శన శాలంటే ఏమనుకున్నావు?"

"వస్తు...ప్రదర్శన...శాల అనుకున్నాను" అన్నాడు ముసిముసి నవ్వులతో.

"పిచ్చి తండ్రి, అక్కడే నీవు పొరపాటు పడ్డావు. వస్తు

ప్రదర్శనశాలంటే మళయాళంలో స్త్రీ ప్రదర్శనశాల అన్న మాట. ఈ పట్టణంలోని సుందరాంగులందరూ అక్కడే ఉంటారు. సరకులు అమ్మేవారు, కొనేవారు, అందరూ స్త్రీలే! అటువంటి ఆనంద మందిరానికి నిన్నిప్పుడు తీసు కొని పోతున్నాను." అన్నది ఒకచేతో కారు నడుపుతూ రెండో చేత్తో హారన్ ఊదుతూ.

"ఆ సౌందర్యరాశిలోకి నేనెందుకు?"

"నాకోసం"

మొహం చిట్లించి, "నీకోసం నేనెందుకు?"

"తెలితారలకు వెలుగెందుకు? తలిరు పూవులకు తావి ఎందుకు? నీవు నాకందుకు"

"ఎలిజా నీవు మళయాళం మాట్లాడుతున్నావు"

"మహాశయా సుతారంగా తప్పించుకున్నారు"

ఇద్దరూ ఒకరిని చూచి ఒకరు నవ్వుకున్నారు. కారు దారి తప్పింది.

ఆ స్త్రీలను చూచి గోపీ అదే స్వర్గ మనుకున్నాడు. ఆసౌందర్యమును చూచి ముగ్ధుడై పోయినాడు...ఎలిజా అతనిని ఆ ప్రదర్శన శాలలోని ప్రతిషాపూ తిప్పింది. ఇద్దరూకలిసి కొన్ని వస్తువులు కొన్నారు. ఎలిజా కోటు గుడ్డా, పట్టుగుడ్డా, మరికొన్ని కొన్నది. గోపీ ఒకచీరే, జాకెట్టూ, కొన్నాడు.

"గోపీ, ఆచీర, జాకెట్టు నీకు బాగుంటాయి. ఏదీ ఆలోచించనియ్యి...ఆజాకెట్టు తొడుక్కొని, ఆ చీరె కట్టుకొని...ఆహా గోపీ, ఎంత మనోహరంగా ఉంటావు!"

గోపీకి ఏమీా తోచక, "తమరు మద్రాసులో టైలరుచేత కోటు వేసుకున్న దానికంటే బాగానే ఉంటాను. మళయాళీ స్త్రీల కూడకట్టు కంటే నాకీచీర అనేకరెట్లు బాగుం టుంది. తమరేమీా చెప్ప నక్కరలేదు" అన్నాడు.

"అబ్బా, ఇంతలో ఉరుములు. ఇంతలో మెరుపులు. నీతో నేను వేగలేను గోపీ. ఇప్పుడు నే నన్నదానిలో తప్పేమున్నది? ఈచీర నీకు పసందుగా ఉంటుంది అన్నాను. ఎర్రనివాళ్లు నల్లచీర కట్టుకుంటే మేఘావృత మైన చంద్రబింబం లాగుంటారు. ఆ సంగతి నీకూ తెలుసు. లేకపోతే ఇంతడబ్బు తగలవేసి ఆచీర ఎందుకు కొంటావు? ఆహా, ఈ చీర నీకెంత బాగుంటుంది! నీకు కోపంవచ్చినా రాకపోయినా బాగానే ఉంటుంది. ఇంకా నామాటలు నమ్మకపోతే ఆ అమ్మాయిని అడుగుదాం... 'జేన్, ఇల్లారా?' అని ప్రక్కబట్టల షాపులో బేరంచేస్తున్న ఒక యువతిని పిలిచి గోపీచేతిలోని చీరెను లాగి ఆమెకు చూపుతూ " ఈ చీరె ఈయనకు అందంగా ఉండదా జేన్" అన్నది.

ఆమె ఆ చీరెనుచూచి, గోపీని నఖశిఖ పర్యంతమూ చూచి, "అద్భుతంగా ఉంటుంది. నేత్రానందంగా ఉంటుంది. మనోరంజకంగా ఉంటుంది" అన్నది.

గోపీ, జేన్ చూపులను భరించలేక, తలవాల్చి క్రిందకు చూస్తూ, కాలి బొటనవ్రేలిని భూమిలోకి గుచ్చుతున్నాడు.

"గోపీ, సిగ్గుపడకు. యదార్థమది" అని అన్నది లాలనగా.

"ఈ పురుషులకు సౌందర్యం కొద్దీ సిగ్గు" అని బుగ్గ పోటు పొడిచి క్రీగంటచూస్తూ వెళ్ళింది జేన్.

"గోపీ, ఇటుచూడు...ఏదీ ఒక్కసారి చూద్దూ... జేన్ పోయిందిలే! మా బాబుగా, ఒక్కసారిచూద్దూ! ఎంత చదువుకున్నా మీరా జాతికి సిగ్గుపోదుగదా. పోదాం రా" అని చేయిపట్టుకుంది.

జేవురించిన మొహం పైకెత్తి "ఎక్కడికి? ఇంటి కేనా?" అని అడిగాడు.

"ఏమంత తొందర? ఆనందమును భరించ లేనంత దుర్బలుడవు గాదే నీవు. అనుభవించ వలసినదంతా ముందున్నదోయి? ఇప్పుడే నీరసపడి పోకు"

"ఎలిజా, ఈ ఆనందం చాలునాకు. మహాతల్లీ, నన్నిలా బ్రతుకనివ్వు"

"ప్రాధేయ పడేవారిని చూస్తే స్త్రీకి పెత్తనంచేయ బుద్ధి అవుతుంది. ఎవరిఇష్టం వారిది. నీకు సంతోషమును ప్రసాదించే పనులు చేయడం నావంతు. వాటివల్ల సుఖమును పొందడం నీవంతు. కనుక టీ తీసుకుందాం రా," అని గోపీ చేయిపట్టుకుంది.

"చిత్తము చిత్తము. చేయి వదలివేయండి. వస్తాను," అన్నాడు, అతడు.

ఆ స్వర్గంలో అది నందనోద్యానం, అది "మధురవేణు వీణాగాన మండితం" అది "వికచ మందారపుష్ప మరంద గురుఝరీప్లావితం" అప్సరసలవంటి స్త్రీలున్నారందరా

"గోపీ, ఎక్కడ కూర్చుందాం," అన్నది ఎలిజా.

"ఎక్కడయినా సరే,"

"అదీ తెలివి. ఎక్కడో కూర్చుని ఇంత కాఫీ గొంతులో పోసుకుంటే సరిపోతుందా? అయితే ఇంతదూరమెందుకూ? ఇంటివద్దే ఆపని పూర్తిచేసుకోవచ్చే!...అదిగో ఆబల్లదగ్గర చూడు: ఆఅమ్మాయి సౌందర్యం. ఆఅమ్మాయి చేతి కాఫీ, మిగిలినవాళ్ళు యిచ్చేకాఫీ ఒకేలాగుంటుందా? అక్కడకు పోదాం రా."

గోపీ మాట్లాడకుండా ఆమె అడుగుల్లో అడుగులు వేస్తూ వెళ్ళాడు. ఆ గదిలోని స్త్రీలందరూ తన్ను వింతగా చూస్తున్నట్లు తెలిసికొన్నప్పుడు అతని అడుగులు తడబడ్డాయి, నెమ్మదిగా ఎలిజా ప్రక్కనున్న కుర్చీలోకి జారాడు.

"ఏమి కావాలో చెప్పు," అన్నది ఎలిజా.

"టీ తీసుకొని రండి," అన్నాడు గోపీ తననుచూస్తూ నిలబడిన ఆ సౌందర్యవతితో.

" మా ఇద్దరికీ బ్రెడ్డూ, బట్టర్ తీసుకొని రండి," అన్నది ఎలిజా

"నాకు అక్కర లేదండి. ఎవరి ఇష్టము వచ్చింది వారికి తీసుకొని రండి"

మారాము చేసే పిల్లవానిని మందలించే తల్లివలె, "గోపీ!" అన్నది ఎలిజా.

"పాపం, వారిని బలవంత పెట్టకండి. పురుషులను కూడా పువ్వులవలె వాడుకోవాలి. వారు సుకుమారులు," అంటూ అమ్మాయి గోపీ బిక్కమొహంచూచింది.

"మరేమీ పరవాలేదు. జాలి తలచకు. నీకెంత హాస్య

న్నదో,—బలవంత పెట్టుటకు—నాకంత హాక్కున్నది,” అన్నది ఎలిజా నవ్వుతూ.

“అదా సంగతి” అని అర్థముచేసుకున్నట్లు నవ్వి, బ్రెడ్డు తీసుకురావటానికి పోయింది.

“గోపీ! చూశావా, ఆ అమ్మాయి సౌందర్యం!”

“స్త్రీలకు సౌందర్యం ఉంటుందా! అది ప్రకృతి విరుద్ధం. స్త్రీలల్లో సౌకుమార్యపు నీడలు చూచి సౌందర్యమని భ్రమపడతారు కొందరు. అసలు సౌందర్యం పురుషులదే,” అన్నాడు గోపీ.

ఆ సమయములోనే ఆమె చెరియొక ప్లేట్‌లో బ్రెడ్డు తెచ్చి వారిముందు ఉంచింది. ఎలిజా గోపీని చూపుతూ “చూశారా వీరేమంటున్నారో? మీరు సౌందర్యవతులు కారట. మీ సౌకుమార్యపు వెలుగునీడలు చూచి కొందరు సౌందర్యమని భ్రమపడుతున్నారట.”

గోపీ నోటిలో ఉంచుకోబోయిన బ్రెడ్డుముక్కను అలా చేత్తోపట్టుకుని నిర్ఘాంతపడి చూశాడు.

“పోనీ లెండి, పురుషులకు అంతవరకయినా తెలిసింది. అసలు సౌందర్యమనేది ప్రపంచంలో లేదని వాళ్ళకింకా తెలియదు పాపం! నిన్నగాక మొన్ననేగా వాళ్లు కళ్ళు తెరిచింది అందులో ఈయన మరీ వింతగా ఉన్నాడు,” అన్నదా అమ్మాయి.

గోపీ హృదయం చీమల పుట్టవలె గులగుల లాడింది. స్వర్గంలో, కిలకిల నవ్వులలో, పుష్పొడిపూతలలో, అప్సరనల చేతులలో, ఉన్న మానవునివలె, అశోకవనంలో

రాక్షసులమధ్య రద్దీ రవ్వ సహించలేక విలపిస్తోన్న చిక్కు-బడిన కేశముల సీతామ్మవారివలె, సతుల మాయలుపన్ని, పాలిండ్లు పొంగారించుకొని, పైఅంచుల్ మోవగ అధరం శాసించిన వరూధిని చేతులలో బడ్డ ప్రవరాఖ్యునివలె, వెతజెందాడు. వాళ్ళిద్దరూ అతని అవస్థ చూచి పతివ్రతలను చూచి అపహాస్యముచేసే రసికులవలె నవ్వారు.

టీ త్రాగి ఇద్దరూ బయలుదేరారు. ప్రదర్శనశాలను దాటి కారువైపుకు నడుస్తున్నారు.

"గోపీ, ఎట్లాఉన్నది ఈ ప్రదర్శనశాల?" అన్నది ఎలిజా.

"నా మొహం లాగున్నది."

"అంత ఆకర్షణీయంగా ఉన్నదా? ఏ వస్తువయినా నీ హృదయాన్ని అంతగా ఆకర్షించడం నేనోర్వలేను గోపీ."

"ఎలిజా, నేనాంధ్రుడననీ, అవమానంసహించలేననీ..."

"సహించక ఏమి చేస్తావు?" అని అడిగింది గోపీకి ఎదురుగావచ్చి నిలబడి.

"ఏమి చేస్తానా? ఏమిచేస్తానా? ఇదిగో ఇటుచూడు: కంఠమెత్తి, చేతులను చాచి ఏడుస్తాను."

"గోపీ, నా గోపీ!" అని ఎలిజా అతని తల తన భుజము మీద ఆనించుకొని, కేశములు సవరిస్తూ, తనసిల్కు చేతి రుమాలాతో కన్నీరు తుడుస్తూ, సముదాయిస్తూంది.

# పట్టాభిగారి సోషలిజం

కర్త: శ్రీగోపీచంద్

వెల 0—6—0

కాంగ్రెస్ అధ్యక్షపదవిలో, రాజీనామాయిచ్చిన సుభాష్ బాబు వున్నా, తరువాత ఎన్నుకోబడ్డ రాజేంద్ర బాబు వున్నా ఒకటే, భేదంలేదు.

ఎప్పుడు భేదం?

పడిపోయిన పలుకుబడిని తిరిగి సంపాయించి ఫెడరేషన్ పుచ్చుకోటానికి ప్రయత్నిస్తున్న పటేలు కంపెనీకిన్నీ, ఫెడరేషన్ను, చీల్చి, చెండాడి, స్వాతంత్ర్యతత్వంతో తెగతెంపులు చేసుకోవాలనే తీవ్రవాదులకు సామరస్యం కుదిరేవరకూ.

సోషలిజం, వెర్రితలలు వేస్తున్న యీ రోజుల్లో, విప్లవతత్వాన్ని గ్రహించని కుర్రవాళ్ళ చేతుల్లోపడి, సోషలిజం ఏ విధంగా అపఖ్యాతి సంపాయించుకుంటుందో, తత్వవిప్లవంతో కూడిన సైంటిఫిక్ సోషలిజంయొక్క ముఖ్య సూత్రాలేమిటో మీరు తెలుసుకోవాలని వుందా? లక్నోనుంచి "నేను దృఢమైన సోషలిస్టుని" అని గందరగోళపు జవహారిలాల్ కేక వేస్తే, "హు! నేనూ సోషలిస్టునే" అంటూ బందరునుంచి పట్టాభి రంకె వేస్తున్నాడు. ఎవరు సోషలిస్టులు? ఏది సోషలిజం? తెలుసుకోవాలని వుంటే ఒకసారి చదవండి. ఇంత మంచి పుస్తకము గూడా ఆరు అణాలేనా అని ప్రజామిత్ర, వాహినిలాంటి ఉత్తమ పత్రికలు విస్తుపోతున్నాయి.

దొరుకుచోటు: **మహతి, తెనాలి.**

# మెడికల్ హోమ్.

కెమిస్ట్సు అండ్ డ్రగిస్ట్సు.

## గాంధీచౌక్, తెనాలి.

హోమియో, యింగ్లీషు, అన్నిరకాల మందులు చౌక
ధరలకు, మంచిరకంలో, దొరుకుచోటు

All sorts of medicines—quality best—
rates cheap. Injuctions—drugs—
patents, all with original labels
for rates dead cheap.

---

# రాడికల్ పబ్లికేషన్స్

త్వరలో వెలువడు పుస్తకాలు

1. యం. యన్. రాయ్ వ్యాసాలు (అచ్చులోవుంది)
2. పిరన్ డెల్లో కథలు
3. సోషలిస్టు ఉద్యమచరిత్ర (అచ్చులోవుంది)
4. మన కర్తవ్యము
5. సునీథ (ఏకాంకిక) (అచ్చులోవుంది)
6. నల్ల అమ్మాయి (కథలసంపుటి)

# యువ

విచిత్ర మాస పత్రిక

సంపాదకుడు

కొ. కుటుంబరావు

సాలు చందా: రూపాయి ఎనిమిదణాలు

విడిప్రతి : రెండణాలు

యువ కార్యాలయం

తెనాలి

# మహతి

## మాసపత్రిక.

సంపాదకుడు:

శ్రీ వాసిరెడ్డి వేంకటసుబ్బయ్య.

'మహతి'—పేరే మధురము—రచనా
విన్యాసము అంతకంటె మధురము.
మీ హృదయ తంత్రులను స్పందింప
చేయు మధుర స్వరములు గలది.
సర్వాంధ్ర దేశమునకు ఏకైకమగు
భాషాపత్రిక. రమణీయ ముద్రణము.
సాలుచందా రు 2/-మాత్రమే.

మహతి,
తెనాలి.